# సమాధి

## (కావ్యము)

మంత్రిరావు
సత్య నారాయణ.

శ్రీ శివశంకరశాస్త్రి
పీఠికతో

నవ్య సాహిత్య పరిషత్తు:
గుంటూరు: ౧౯౪౧.

ఎవరి విజ్ఞాన తేజమ్ము లీధరిత్రి
వ్యర్థమై, జీర్ణమై లోన నస్తమింప
బాధల భరింతు రా కళారాధకులకు
నంజలి ఘటించి యిత్తు నీయంకితమ్ము.

బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవ స్స్మయదూషితాః
అబోధోప హతా శ్చాన్యే జీర్ణ మఙ్గే సుభాషితమ్.

భర్తృహరిః

# పీఠిక

‘సమాధి’ అన్నపుడు యోగసూత్రాలలో చెప్పిన సమాధి కాదు; మృతవస్తువును భూస్థాపన చెయ్యడ మని అభిప్రాయము. ఈ కావ్యములో రెండుమరణాలు ఉన్నవి. అందుచేత సమాధి అనడము సరిపోతున్నది.

ఆధునిక కవిత్వము ముప్ఫయి యేళ్ళనుంచీ ముక్తకప్రాయము అయిపోయింది. విశేషంగా ప్రాచీన మార్గావలంబులు ప్రపంచించి బారుమీదనే వస్తువును వర్ణిస్తున్నారు. ఆధునికులు అందరూ ఇంచు మించుగా అనిబద్ధ కృతులే అల్లుతున్నారు. భావాలే ప్రధాన మనీ, కథ అంత ప్రధానము కాదనీ, వాదము.

‘సమాధి’ మొత్తంమీద అనిబద్ధకృతి అనడానికి వీలులేదు. ఇందులో కథ ముఖ్యమై మూడువందల పద్యాలతో ముగుస్తున్నది. దీనిలో పూర్వభాగము కథాపీఠము. ఉత్తర భాగములో కథాక్రమము. ఇద్దరు పాత్రలున్నప్పటికీ ప్రధానపురుషుని అభిధ కాని, కథకుడైన ద్వితీయుని నామము గాని తెలియదు. కాని నాయకుడు కవి అనే విషయము విస్పష్టము. కథకుడుకూడా కవి గాని, కవితాప్రియుడుగాని కాక తప్పదు. నైమిశారణ్యములో సూతుడు శౌనకాదులకు చెప్పినట్లు కాక, ఇందులో కథనము పుస్తకము చేతపట్టిన పురుషులకూ, పూబోణులకూ వర్తిస్తుం దని చెప్పవలె. నిజానికి ఏపుస్తక మైనా ఎవరికో ఒకరికి ఎదట పడి చెప్పినట్లు ఎంచుకోవలె.

కథకుడు రాత్రివేళ కృష్ణానదీతీరానికి వెళ్ళాడట. అది చీకటిరాత్రి. మేఘాడంబరం మెండు. మధ్యమధ్య మెరుపుతీగెలు కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్నవి. ఇంతలో ఏదో మంట కనబడ్డది. దగ్గరలో నీడకూడా

గోచరించింది. ఇంచుమించుగా ఇరవై అయిదేళ్ళమనిషి భీకరాకారంతో జాలి గొలిపే చూపుతో కనబడతాడు. ఏవో కాకితాలు కాలుస్తున్నాడు. కథకుడు దగ్గరికి వెళ్ళి చూస్తే, అవికావ్యభాగాలలాగ కనపడ్డవి. ఇతను అతన్ని వారించి మందలించాడు. ఇద్దరికీ కొంత చర్చ జరిగింది. కర్మ, దైవము, లోకము, కవిజీవితము మొదలైన వాటినిగురించి వాదనలు చేశారు. తర్వాత నాయకుడైనకవి ఉత్తరభాగములో తనవృత్తాంతము వివరిస్తాడు.

అతను మంచికుటుంబములో పుట్టాడట. బహుశా బ్రాహ్మణుడేమో. గాఢానురాగము గలతల్లి చిన్నతనంలోనే పోయింది. తండ్రి తనను పెద్ద వాణ్ణి చేసి, చదువు చెప్పించి, వివాహం చేసి, ఉద్యోగం ఇప్పించాడు. కాలక్రమేణ ఆయనకూడా పోయినాడు. తనకూ భార్యకూ కొన్నివిష యాలలో కలవలేదట. నిజానికి కవితో కాపరం చెయ్యడం కాంతకు కొంతకష్టమే. పైన ఉద్యోగంకూడా పోయిందట. భార్య కానుపులో కాలం చేసింది. ఆస్తి పోయింది. అన్నం దొరకడమే కష్టమయింది. తాను ఎప్పుడూ కావ్యనిమగ్నుడు కావడమూ, కాంచనమువీద దృష్టి లేకపోవడమూవల్ల కష్టాలు హెచ్చినవి. తాను పుస్తకాలు వ్రాసినప్పటికీ ఎవరూ ఆదరించలేదు. ఏదీ అచ్చు పడడమే లేదు. మిత్రులనేవాళ్ళు కూడా మృగ్యులయినారు. చివరకు భిక్షాటనముకూడా చెయ్యవలసివచ్చింది. జీవితము దుర్భర మయిపోయింది! కర్మసిద్ధాంతమువీద నమ్మకము లేదు. విశ్వాత్మకునిమీద విశ్వాసము లేనేలేదు. సంఘమువీద అసహ్యం పుట్టింది. అటువంటివాడు ఏం చేస్తాడు? ఆత్మహననమే అభిలషిస్తాడు. దానికికూడా ధైర్యము కావాలి. విధిలేక తనకథ అంతా చెప్పి కృష్ణోదకము కుండతో తెచ్చి, కాల్చినకాగితాలబూడిద అందులో కలిపి, కొంచెం తాను దాల్చి భాండము పాతిపెట్టి, సమాధి చేసి, కృష్ణానదిలో దూకి, కాలగర్భములో లీన మయినాడు. ఇది కథ.

విశిష్టయోగ్యవిషయాలమీద విశ్వాసము లేనివాళ్ళు, లోకజ్ఞానము, లేనివాళ్ళూ తరుచుగా ఇలాగే అవుతూ ఉంటారు కవులు కీర్తికాంతా పరులై ప్రపంచజ్ఞానము లేక బాధలపాలు అవుతూఉంటా రని చూపడము ఈరచయిత ఉద్దేశము కాబోలు.

కవి తనను ఎలాగో సంతోష పెట్టితేనే గాని సంఘము కవికి సమాదరము చూపదు. ఒక్కొక్కప్పుడు యోగ్యులనుకూడా యుక్తగౌర వము లభించదు. అంతమాత్రానికి సంఘముమీద కవికి అసహ్యం కలగడం ఆరోగ్యసూచకం కాదు. కొంతపేరు పడినకవి ఒకాయన తాను మహా ప్రతిభావంతుడ ననీ, తనదృష్టిలో అయోగ్యు లయిన అనేకులకు ఆదరము అధికంగా జరుగుతున్న దనీ, అసహ్యంగా అనేవాడు. చివరకు అతనికి పిచ్చి యెత్తింది!

ఏదో విశ్వాసమో ఆలంబనమో లేనివారికి అవస్థ తప్పదు. ఎవరు కా దన్నా, కర్మసిద్ధాంతము కాలచక్రమువలె తిరుగుతూ ఉండేదే. దాని స్వరూపస్వభావాలు గ్రహించినవారికి మహాకష్టాలలోనైనా మన శ్శాంతి ఉంటుంది. సరి అయిన సమన్వయము కుదిరినపుడు ఘోరనిరాశలో ఉన్నవారికికూడా ఈసిద్ధాంతము కొంతశాంతి ఇచ్చికుదురుగాఉంచుతుంది.

పద్యకవిత్వము చెప్పి బతుకుదెరువు బాగా చూచుకొన్నవాళ్ళు కొద్ది మంది ఉన్నారు. కాని, కవిజనానికి కానీ దొరకడం కష్టం. పద్యాలు ప్రకటించే పత్రికలే తగ్గుతున్నవి.

ప్రథమములో కొందరు జ్ఞానసంపాదన చేస్తారు. తర్వాత ప్రచారక దృష్టి ప్రబలుతుంది. చివరకు శాంతి ఏర్పడుతుంది. మధ్యస్థితిలో మానవునికి ప్రమాదము. ఇతరులు తనమాట వినలే దని తల్లడిల్లడము తగినపని కా దనిపిస్తుంది. ఆత్మానందముకోసం కావ్యం చేస్తే, అన్యులకూ ఆనందం కలగక పోదు.

రమారమి రెండున్నర సంవత్సరాల కిందట కవి ఈకావ్యము రచించినారు. ప్రథమప్రయత్నము కావడముచేత ఈయువకునిరచనలో కొన్నికొన్ని లోపాలు లేక పోలేదు. దేనికైనా అవి తప్పవు. కావ్యభాషలో కలియని కొన్నిపదాలు, కేవలవాదాత్మక మైనపద్యాలు కొద్దిగా కనబడుతున్నవి. అంతమాత్రం లో నే గ్రంథం అనామకముకాదు. కడ కెల్లా గున్నా మొత్తము మీద కావ్యముచిత్తమును ఆకర్షిస్తున్నది. ప్రాచీనాంధ్రకావ్యాలు బాగా చదవడముచేత ఇతనికి ధారాళ మైనసరళరీతి సంక్రమించింది. గీతపద్యాలు సీసపద్యాలు, వృత్తాలూ చల్లగా నడిచినవి.

సమాధిలో కవి ఉద్దేశించిన ప్రధానవిషయము బాగా వ్యక్త మయినది.

ఇతి శివమ్!

అడయారు

జూన్ ౧౯౪౧.

శివ శంకర శాస్త్రి

నిత్యకళ్యాణి కృష్ణవేణీ స్రవంతి
చిలిపి చేష్టల నిరుల నెచ్చెలులఁబిలచి,
నగ్ననాట్యమ్ముసల్పి, సంధ్యాతరంగ
రాశిని చలించెనాశూన్య రంగమందు. ౧

సంజకెంజాయ క్షీణించి సన్నగిల్లఁ
గడలి కెరటాల పోల్కఁజీఁకటి నటించెఁ
బ్రక్కగానున్నవే కానఁబడని భంగిఁ
గరఁగి వ్యాపించె నా శ్యామికా తమస్సు. ౨

భారమై జాలు నాతమః పటలమందుఁ
కృష్ణవేణమ్మ కురులపై కెరలి తెరలి
యామినీకాంత సల్పు నృత్యప్రదీప్తి
కాటుకల ముద్దవలెఁ బైకిఁగానఁబడియె. 3

వడలుచు, నెండి, నేలపయి (వ్రాలెడి యాకులజంతుసంతతుల్
నడుమజనించు కర్కశనినాదము, తీతువు పిట్టకూఁత, మూ
గెడి క్రిమికోటి సంతతుల "కీచ" ను సందడితప్ప, నెట్టి స
వ్వడియుఁ(వినంగఁ జాలని విభావరి చేసె నరిష్టసూచనల్. ౪

శర్వరీసాధ్వి నృత్యఃట్మ్రి సల్పునపుడు
గాలికిఁ జలించు నాకాంత నీలిచీర
వోలె, వివిధాకృతులతోడఁ బోల్పనయ్యె
నానదీగర్భమునఁ దేలు నలల సొగసు. ౫

దేవికోగాని, యానదీతీరమందు
యోచనాబ్ధినిమున్గి నేనొక్కనాఁడు
తన్మయుఁడనైతిఁ బరవశత్వమున
నాఁడు
ఫాల్గునికమాసమం దమావాస్యరాత్రి. ౬

అట్టి నిశ్శబ్దమందు నేకాగ్రమైన
మానసిక వీక్షణంబుల జాలఁజేయ
నాతమస్వినీకుహరంబులందుఁ బుట్టె
నొక్క హాసంబు దిక్కులు పిక్కటిల్ల. ౭

అంతమే లేనివైన గుహాంతరములఁ
గేసరీగర్జనములుఁ బ్రాఁకెడి విధమ్ము
నాతమంబున జననమైనట్టి నగవు
కాఱుచీఁకటి గిరులతో మాఱుమ్రోగె. ౮

గగనమందు ఘనాఘన గర్జనమ్ము
పగిది, విపరీతమైన శబ్దము జనించె;
నఱుముతోఁగూడ నేతెంచు మెఱుపుపోల్కి
శర్వరీ గర్భమునఁ బుట్టె జ్వాల యొకటి. ౯

మాయగాఁ దోఁచినట్టి యామంటఁగాంచి
ధైర్యమును జిక్కఁబట్టుచుఁ "దమములందు
నచటచటలేచు కొఱవి దయ్యంబులేమొ?
భయమిటులఁగొల్పు" ననెడి విభ్రమముదోఁచె. ౧౦

జ్వలితకాంతుల వెల్గు నాజ్వాల వెనుక
ఛాయ యొక్కటి కాన్పించె స్పష్టముగను;
అటులిటులనూఁగు నానీడ నరయవలయు
ననుచుఁ గాంచితి నాకుతూహలము కదుప. ౧౧

సంస్కారహీనమై, జడలుగట్టఁ, గృశించి,
సరిలేని బిరుసు కేశములుఁ జెదర
శుష్కమై, జీర్ణమై, సుకుమారతాశూన్య
మైనట్టి శిథిలదేహము చలింప;

ముఱికిపాఱి శరీరమును గప్పఁగాలేని
మలినమౌ జీర్ణవల్కలము తెగయఁ;
గరుడుగట్టుకొని శోకము రూపమును దాల్చి
కరఁగనేరక కండ్లఁదఱిమి నిలువ;

నేఁడెయో కాగితములఁ దా నేఱి పేర్చి
యగ్ని రగిలించి యాజ్వాల నరయు నపుడు
తలుసుకొనివచ్చు ముదముతో ముఱిసె నొక్కఁ
డిరువదైదేండ్ల ప్రాయమున దెసఁగి యుండు. ౧౨

ఎక్కడి వాఁడో కాని యతిహీన పరిస్థితులందుఁ జిక్కియే
దిక్కును లేనివాని పగిదిన్ గనిపించెను వానిరీతి; యా
చెక్కులందు ధారలయి చిమ్మిన యశ్రువులెండి, యెంతయో
చిక్కఁగ, శల్యమౌ వదనసీమను నిల్చెను చాఱికల్ వలెన్. ౧౩

నిత్యమును నేత్రముల నీరునింపుచున్న
తాపమున నేమొ? వానినేత్రద్వయంబు
తేఁట విడనాడి, కెంపులై నాఁటిజ్వాల
వలెను నెత్తురు జీరలై భయముఁ గొల్పె. ౧౪

క్షుద్రమై, శూన్యమైపోయి, చూచునంత
జాలిగల్పించె వాని వీక్షణలమూల్గు;
కాని, యొక తీక్ష్ణమగు జీవకళికమాత్ర
మాఱిపోలేదు వానినేత్రాంచలముల. ౧౫

దీర్ఘశోకాగ్ని కగ్గమై, తీరుఁదప్పి
యణఁగి శుష్కించె నాజీవియంగపుష్టి;
కాని, యాదృష్టిలోని తీక్ష్ణ ప్రభావ
కళికలోమాత్రమున్న దాకర్షణమ్ము. ౧౬

ఆర్తియో? ధాన్యమో? మఱెయ్యదియొ? కాని
యతనిసన్నిధి కీడ్వ, నే నటనిముందు
మండుచున్నట్టి మంటపై మరలఁ జేసి
నాను, నాదృష్టులను, యోచనములనుండి. ౧౭

అంతట నే నేగితిఁ జితి
చెంతకు; నందుండినట్టి చిహ్నములయ్యో!
సంతాపకరములై, నా
చింతను పలుగతుల వృద్ధిఁ జేసినవయ్యెన్. ౧౮

తనతోడిదే లోక మనెడి నాధునిఁ బిల్చి
లాలించి పంపుమాంచాలసాధ్వి
తనమ్రోల నేడ్చువాణిని జీరి యుభయహ
స్తమున నోదార్చు పోతన తపస్వి

తన చేతిముద్దుపట్టిని దాదికిడి, రక్ష
ణము వేడి యేడ్చుమల్లమ లతాంగి
తన దేహరక్షణమ్మునకు స్వస్తిని జెప్పి
మహనీయుఁడైన వేమన మహర్షి

వీర లందఱు నెవరి జీవితవికాస
కాంతిలో నాకృతులఁ దాల్చఁగలిగినారొ?
గాని, దురదృష్టవశమున, నానిషాదు
దారుణాగ్రహవహ్ని కింధనములైరి. ౧౯

అతని ముందుగఁ జిత్రముల్చితిసి బడుచు
దగ్ధమై పోవుచుండె చిత్తము రగిల్చి;
దగ్ధమగుచుడునవి గుండెతఱగఁ జేయ
తల్లడమునందెనాత్మ, శాంతమునశింప. ౨౦

కాలు కాగితములలోని కావ్యరచన
ముద్దుమూటలుగట్టి ప్రేముడిని గొల్పి
ముత్తియపుఁ గోవలను బోలి, మురిపెమొసఁగు
నక్షరంబుల సంపుటమై చెలంగె. ౨౧

అట్టి కావ్యముల్ సైతమాయగ్ని కాజ్య
భాగలై పోవ నతఁడెట్టి బాధపడక,
భారమగు దేనినోదింపి బ్రతుకపగిది,
రక్తినంది పిశాచచర్యల నొనర్చె. ౨౨

"ఏయభాగ్యులు వీనినీరీతిరచియించి
జీవితంబుల ధూళిఁ జేసినారొ?
ఏపాపపు ముహూర్తమితనికీ ఋణమిచ్చి
పగవానివలె దగ్ధపఱుపుమనెనో?

ఏ కర్మవశముచే నిట్టి పాపపుబుద్ధి
జనియించెనో వీనిమనమునందు?
ఇతఁ డెవ్వఁడో? లేక, యీతఁడే వీనిఁగూ
ర్చినయట్టి శాస్త్రపారీణుఁడేమొ?

కటకటా! యీతఁడే వీని కవియైన
రాక్షసునిరీతిగాఁ గాల్చి రక్తిఁ గనునె?
ఇట్టిమూర్ఖుండు కవియగు టెట్టు?" లనుచు
పరిపరివిధాల నూహించి యరయఁబోతి. ౨౩

అతని పైశాచికంపు టాకృతిని గాంచి
పలుకనే లేక భీతిచే నిలచిపోతి;
కడకు, నావ్యక్తియొక్క సంగతి వినంగ
నెంచి, యాతనినడుగఁ దెగించియుంటి. ౨౪

“ఎవ్వఁడవోయి? నీదు నెల వెయ్యది? యిట్టినిశీథమందు, నీ
వెవ్వనిగాంచ నొంటరిగ నిందిటులుంటివి? నామమేమి? నీ
కెవ్వరు లేరె బంధుజను లెక్కడనైనను? ఇట్లుఁ గాల్చు మం
చెవ్వరు చెప్పిరో కద! యిదేమి? హసించెద వేల? నాయనా! ౨౫

ఏమోయీ! యిదియేమి సంతసము? నీవింతేని చింతింపఁబో
వేమీ? యీగతి నిట్టి చిత్రములు వహ్నిం జేరి కావ్యాలతో
నామంబైనను లేక ధూళియయి శూన్యంబందుఁ జేఱంగ, నీ
కేమీ బాధగఁదోచ లేదె? యిది నీకింపైనదా? సోదరా! ౨౬

ఇవి రచియించినట్టి కవి యెవ్వఁడో కాని, యఖండభాగ్యుఁడౌ
కవియయియుండునంచు నివిగాంచిన దాని తలంచుచుంటి; నీ
కవి దహియింపఁ జేతు లెటులాడెను? జాలిజనింప లేదె? యే
కవి యొకచించినట్టి యివి కాల్చుటకున్నగయే ప్రధానమా? ౨౭

ఇవిగావించిన పాపమేమి? యకటా! యీఘోరమౌదృశ్యమా
కవియేగాంచినగుండెబాదుకొని యీకావ్యాలతోఁబాటు తా
నవసానంబును జెందకుండునె? విషాదాంతంబు సూచించు నీ
కివియేగాని మఱొండు లభ్యమవలేదేయిట్లుగావింపగన్? ౨౮

నన్నుఁ విరోధిగాఁగనిమనంబునచింతనుజెందఁబోకు; మా
పన్నులఁజేరి వారల విపత్తులనుండి విముక్తిచేయ స
భ్యున్నతి నాదరించెడున సోదరుమాడ్కి నన్నుందలంపు; మిం
కెన్నడుఁగూడవీని హితమెంచకఁజేయకు మిట్టి చేష్టలన్. ౨౯

కాన, సోదరా! కవులకావ్యము లిట్లు దహింపఁబోకుమీ
దీనునిగాంచియైనను, మదిఁగల బాధతెలుంగనిమ్ము: నా
చేనగునద్దియేదయినఁ జేయకమానుదునా? క్షణంబులో
బూనితివేల మౌనము? ప్రభూ! మనసిచ్చివచింపవేలకో? 30

అనివచించెడి నాదువాక్యము లరణ్య
రోదనంబులభంగి, యారోగిమదికి
మందువలెఁ దోఁచినవి:
శూన్యమందు నిల్లు
గట్టుకొనినట్టి యాతఁడే గాంచెఁగడకు. ౩౧

నన్నుఁ గనినంత నే, నయనములు ప్రశ్న
వైచెనాతని గూఢభావన లెఱుంగ,
నతనిఁ బ్రశ్నించె నాచూపులనియు నేమొ?
అతఁడు తలవంచి యేదియో యనఁదలంచె. ౩౨

ఏదియో చెప్పఁబోయి తానింతలోనె
నవ్వుకొనియాగె, భావబంధములుకంఠ
మునకు, నాటంకమైనిల్వ, ముద్దమ్రింగు
పేదవలె నాతఁడుక్కిరిబిక్కిరయ్యె. ౩౩

తెలుపఁబోవున దేదియో తెలుపలేక
గనుఁగొనలలోన దీర్ఘశోకము జనింపఁ
దనకనులనుండి పంపె నాకనుల వైపు
కనులలో దాగినట్టి తీక్ష్ణప్రదీప్తి. 3౪

ఏదియో తీక్ష్ణమగు తేజమెదుటనిల్చి
నాకనలలో నింపె సన్మానకళిక;
మానవమాభావములు దృష్టిఁబోనఁగలసె
నతనిభావమ్మునైనఁ దాళుమనియెనేమొ? 3౫

అతఁడు ననుఁగాంచి విలపించు నంతలోన
నాగిపోయితి వానివాక్యములకొఱకు;
మఱలఁ దలవంచి, కండ్లు చెమర్చుచుండ
గొణుగుకొనె నిట్లు నీళ్ళఁగ్రుక్కుచునతండు. 3౬

''అయ్యో! యిచ్చటనైన నీనరులమాయల్ దప్పవా?
శాంతి నా
కియ్యంజాలెడి వేళకానబడదా? యీసర్వలోకంబునం
దయ్యో! నేమనసారనేడ్చుటకు భాగ్యంబైన ప్రాప్తింపదే
మయ్యా? నాకు జగద్విముక్తి నిడవేమయ్యా? యిదే
వచ్చెదన్". ౩౭

ఇటు లాందోళనమందు నాతనివిధం బీక్షించి, విభ్రాంతిగ
వ్వాటచేఁబల్కఁగ నోరురాక, ''యెవరోపుణ్యాత్ముఁడీజీవితం
బెట్టులో నీడ్చుచు, బాధలంది తుదకిం కెన్నాళ్లకో, చావుకా
గిఁటికై యీగతివేచుచుండె" నని తర్కింపంగ యత్నించి
తిన్. ౩౮

''అటులవిలపించువాని నోదార్చకుండ
నిటులుపేక్షింప యుక్తమెన్నఁటి"? కటంచుఁ
దలఁచి, ''యిఁకజాగుసేయరా"దని, తెగించి,
కార్యసాధనకు నడుముఁ గట్టుకొంటి. ౩౯

ఇంతలో నేత్రదృష్టి యట్టిటుఁజలింప
మంటలోఁ గాలుచున్న వే కంటఁబడియె;
ఆమనోహరమైన కావ్యములఁదీసి
తగులఁబడకుండఁ గనుట ప్రధానమయ్యె. ౪౦

మానవులకుండు సహజధర్మము వచింప
నోర్మియే లేకపోయె; "నయ్యో!" యటంచు
మంటలోఁ గావ్యములుగాలి మట్టియగుటఁ
గాంచనేరక లాగితిఁగాగితముల. ౪౧

అప్పుడే కాగితముల నాహస్తయుగము
దాకెనో? లేదొ? బాధయే సోఁకినట్లు
నంతవరకును స్థాణువౌ నాతఁ డాపె
త్వరితముగ నాదు కేల్పట్టి "వల" దటంచు. ౪౨

"నను వారింపగ నీవెవండ? వింక నీన్యాయంబు నాకేల? న
న్ననంగా రానివి పల్కి నామనసుం గోయంజూచుచున్నావె! ని
న్నివినంతన్ ఫలసిద్ధియా? కఠినజీవీ! నాదినీ కేల? నీ
పనియేమో? బ్రతుకేమొ? చూచుకొనలేవా? యెందుకీ
కర్మముల్?" ౪౩

అనినిందించి జుగుప్సచే బ్రతుకురోయం జూచుచున్నట్టియా
తనివీక్షించుచు నంతలోనసె నిరుత్సాహంబునుం బొంద, "కీ
ఘనునిన్వీడంగ రా" దటంచు దృఢసంకల్పంబుగావించియా
తనిహస్తంబులంగాలనున్న నొకపత్రింబంతలోందీసితిన్. ౪౪

"కనివిననట్టి శక్తుల నొకానొకవ్యక్తి కనుగ్రహించి యా
తని యభివృద్ధినే కడకు దగ్ధముం జేసెద వేలనోయి? యిం
కను, మతిలేనివాని కవకాశములా, పదివేలు! నీవమ
ర్చిన రతనాలకిట్టి నగిషీపని కేమనవచ్చునో? ప్రభూ!" ౪౫

అనిలిఖితమయ్యె నొక్క—పద్యప్రదీప్తి
పావకునిగోరు నాజీర్ణ పత్రమందు;
అయ్యయ్యో! యిట్టి మంచిముత్యాల సరులె
లోకమునకుండు భాగ్యమే లేకపోయె! ౪౬

ఇటుల లోలోన నేడ్చి, దహించుచున్న
వేదన నివారణమునకై వేయిగతులఁ
గనలి, యాపద్యమైన బిగ్గఱగఁ జదివి
వెడలఁ గ్రక్కఁగనుంటి యా వేదనమ్ము. ౪౭

"చేతులుకావివి—కాళ్లుసు
మా! తహతహ పడఁగఁ బోకుమా!" యనితానా
గీతమును జదువనీయక,
చేతులఁ దనచేతులందుఁ జేర్చివచించెన్. ౪౮

“వలదోయీ! సఖ! ఆగుమాగుము; భవత్ భావమ్ముల
న్గాంచి లో
పలనేసంతసమందు, తృప్తిఁగని నేఁ బ్రార్థింతుఁగా నిన్ను; ఓ
వలదన్నా! యటు, తీయ బోకు, మివి ‘నావా’! యన్న
మోహాంపుటు
య్యేలలో గెంటక నన్నిటుల్ విడుము, నీకెంతైన
పుణ్యం బగున్. ౨౯

అతి వినయంబుతోఁ బలికి యంజలి నిట్లు ఘటించు
వాని సం
గతి పరికింప వెఱ్ఱి మమకారమటుల్ ద్విగుణీకృతం
బుగా
మతిని గలంచుచుండ, నిసుమంతయుఁ దాల్మిఁ గనంగ

లేక, నే
నతని జుగుప్సఁగాంచి తుదకంటెనిటుల్ సమయోక్తు
లంతటన్'. ౫౦

"ఇవి నీవే చెమటూడ్చి వ్రాసినవటోయీ? యైనచో,
వీనికిన్
గవియైకూడ, ననంతమా రచన దగ్ధంబై నశింపంగ, నీ
కివలోకింప మనస్కరించె నెటులయ్యా? దాతు
వేమోయి? ని
న్నవమానింతునటన్న భీతి విడుమన్నా! యేల
నీ భ్రాంతియున్? ౫౧

నినువీక్షించినదాదిగా నిలుపునన్ నీరయ్యె నామనస
మ్మున జీర్ణించిన కర్కశత్వ, మదియే మోకాని,

నీవేడ్పునం
తనె, నీ మోమున, భగ్నజీవిత వినోద ప్రాభవోన్మాద
త్తా
డనసంజాతవిషాదకల్పితలలాటస్వేదమే గాంచితిన్. ॥ ౨

కనుకన్, నిన్ననినంత నే, హృదయమార్గంబందునవ్యక్త
భా
వన లేవేవియొ గోచరించినవి;—'జీవన్మాయలో
ఛాయయో'
యనఁగా జెల్లెడి నీపవిత్రచరితం బాలించి యీజీవిత
మ్మున ధన్యమ్ముగు 'సార్థకమ్ము'ఁగనెదన్ బోధింపవా
నీకథన్? ॥ ౩

నీకీలోకము మేలుచేసినను గానీ, లేక, శాప్యమ్ముతో
నీకే యింతటి ఘోరకృత్యమును దానే చేయ

యత్నింపనీ,
నీ కేలోపముఁగల్గఁబోవ దిఁక, నన్నే నమ్మి, నాత్రోటిపా
టే కాలంబును బుచ్చలేవె?" యనియంటిన్ వాని
వీక్షించుచున్. ౫౪

అటువచింపఁగ నాదువాక్యములు వాని
హృదయమున నగ్నిఁబేర్చి దహించుచుండె;
నేమియనలేక వలవల నేడ్చుచుండి
జాలి కలుగంగ నిటులనఁజాలె నతఁడు. ౫౫

"తీరనికోరికల్ దఱగఁదీయ నశించెను నాచరిత్ర, మే
తీరున నింక విందువు గతించిన నాపరితాపగాథ? న
య్యో! ౦ సవృష్టినైన నిడనోపనియీకథయే లభించెనా
ధారణిఁబోవనీకు? నిది ధన్యతఁగూడ లభింపనిచ్చునే?
౫౬

ఆగనియగ్ని లోనపరిహాసమనందగు నాజ్య ముంచి,యా
హారతి కండ్లకద్దుకొని యంజలి నిత్తువె, వీనిలోనియా
శారుధిరప్రవాహము? విచారముతోఁదను వెల్లనిల్వనన్
నీరయిపోవ, వేడుక జనించినదా, పరిహాసగోష్ఠికిన్? ౨౮

ఎందులకోయి? వీనిని సహించుచు నిప్పటికైన వెఱ్ఱియా
నందము నందఁగోరెద? విదంతయు నేఁటికి? చూడఁజూడ, నీ
కిందు విరక్తితప్పఁ దుద కేమియుఁగూడ లభింపదేమొ? నా
యందును జాలిఁగాంచియిపుడైనను శాంతిని గాంచ
నిమ్మఁకన్. ౨౯

నన్ను మూఢాంధుఁడైన మానవునిభంగి
గాంచి, విడుమోయి! యీనదీగర్భమునకు;
ఐన, నీకేమిలే, యన్యులనుభవించు
బాధల భరింప బోవు తాపత్రియమ్ము? ౩౦

అందుచే, నీవు నాకొఱ కంద నేల
వర్ణనాతీతమైన యవస్థలిట్లు?
వెఱ్ఱియనురాగమేల? నిన్నీడనిమ్ము
చూడఁ బోకుమా! వీఁ డొక క్షుద్రజీవి." ౬౦

శోకపరితప్తహృదయ మశ్రుస్రవంతి
యందు మునుగంగ, క్షోభించు నతనిఁ గాంచి,
శర్వరీసాధ్వి విడచు బాష్పముల వెనుక
నిలిచియోదార్చె గృష్ణవేణీస్రవంతి. ౬౧

తమమునం దేడ్చునతని నోదార్ప నెంచి
"ధైర్యమును జెప్పుకొనుటయే ధర్మ"మనుచుఁ
"గష్టములఁ దప్పుకొనిపోవఁ గలుగఁజాల
రెట్టివారైన, దుఃఖింతు వేల?" యంటి. ౬౨

కష్టసుఖములు జంటగాఁ గలిసి[illegible]
దైవఘటనముఁ దప్పింపఁ దరమె[illegible]
కాలఁ మంతయుఁ బగలుగాఁ గడుపఁదరమె?
దినములో దాఁగిలేవె, రాత్రింబవళ్లు? ౬౩

ఎవరిజీవిత పరిణామ మెట్లుచనునో?
దానిఁదప్పించుకొన నసాధ్యంబు గాదె?
కమలజునికైనఁ బ్రారబ్ధకర్మఫలముఁ
దప్పఁగా సాధ్యమా, యెన్నితరములైన? ౬౪

ఎన్ని సుఖములకో చంకలెగురవైచి
క్లిష్టకాలమ్మునకును దుఃఖింపదగునె?
కష్టసుఖముల నొకరీతి గడుపఁ దగును
గాని, ఖేదమ్ములో సార్థకతగలుగునె? ౬౫



— [illegible]

దేనికి శాశ్వతత్వమ్ము జగతిన్ గల దందువా? తెల్పుమీ జగ
మ్మైనను శాశ్వతంబె? యిది యైన నెఱుంగవె? యీవిపత్తులే
వైనను 'శాశ్వతంబ'ని భయంబును జెందుట వెఱ్ఱికాదె? నీ
లోని విచార మింక నెటులో శమియింపక నిల్చియుండు నే? ౬౬

మోదమే లేని జీవితాంభోధియందుఁ
గష్టసుఖములుఁ దాత్కాలికములు గావె?
నిశ్చలత లేని వీనిబాధింపఁగలమె?
కాన, దుఃఖింతువే, తరంగములకొఱకు? ౬౭

శాశ్వతము కానివిన్ని విశ్వమ్మునందు
నిమిడినను, శాశ్వతమ్ము కాదే యశస్సు?
కాన, నీచింత మఱచి, లోకమును గొలువ
నెంచి, నీజీవితమ్ము నర్పించుకొమ్ము." ౬౮

ఇటుల నోదార్చు నన్నాతఁ డేవగించి,
తనయసహాయతలోఁ గోపమును వహించి,
మోముపై కెత్తి, శోకమ్ము ముప్పిరిగొన
నఱచె నిటుపండ్లు పటపటకొఱికికొనుచు. ౬౯

"లోకం! లోకమ"మటంచునన్నిటులఁగాళుల్ సేతులున్ గట్టి, యే
లోకంబందునఁ బాఱ వేయుదువు? నేలోకంబుకై జీవితం
బే, కైంకర్యము చేయకుంటినె? యివేవీచాలవా? యింక నెం
దాఁకన్ జీవితమీయఁ గావలయు? నీదాతృత్వమే
యల్పమా? ౭౦

చేసితి నేదియో జనులసేమముకై తనువుం ద్యజించి, యా
చేసిన సేవ చాలక నశించుటకూడ నవశ్య మాయెనా?

చేసిన చింకఁజాలు, నిఁకఁ జేయఁగనేలకో? పూర్వమందు నేఁ
జేసినదేకదా, తుదకు చేదయె పాముఁకు పాలపోలికన్! ౨౧

ఏమిఫలమ్ముఁగోరి వెతలెన్ని సహించుచు సేవఁజేసినా
నో? మదినైన నెంచక వినోదమునంది నశింపఁజేసితా
నేమియొ మూటఁగట్టుకొనె నీనరలోకము! దాచనేల? నే
మేమియొ చెప్పబెందులకు?నీనరులేయిటు చేయలేదొకో?౨౨

'కర్మము!కర్మ'మంచు వెటకారము సేయఁగఁబోకు మోయి!
యీ
కర్మము పూర్వజన్మములఁ గల్గుచు నీగతి జన్మజన్మకున్
ధర్మము మాని వెంటఁబడి దాడియొనర్చునె? యెన్నఁడైన, నీ
కర్మమునుండి బైటఁబడుకాలము మాకులభింపదా యికన్?౨౩

పూర్వజన్మలఁ గావించుపుణ్యపాప
ఫలముగా నొక్క దుఃఖమే కలుగనేల?
పాపమొనరించుచో బాధఁ బడఁగవచ్చుఁ
గాని, పుణ్యమ్ము వలన సౌఖ్యమ్ము లేదె? ౭౪

తరతరమ్ములఁ జేయు సంతతనియుక్త
కర్మముల పాపపుణ్యముల్ గంపెఁడగుచు
వెంటనంటుచు నిటు దాడి వెడలుఁగాని
యెంతకంతకు నివి మాయ మగుట కలదె? ౭౫

అంతకంతకు నాధిక్య మగుచు నుండ
నింక నేరీతి వీని జయింపఁగలము?
పుణ్యమును జేసి సౌఖ్యమ్ము పొందలేము
గాని, యీ పాపఫలమె దుఃఖమునొసంగు. ౭౬

పుణ్య మొనరించి దేవిని బొందలేము
గాని, పాపమ్ము మాత్రమీగతియొసంగు!
నేమియిది! సృష్టిసూత్రమే యెచటి కరిగె?
నేది యొనరించినను దుఃఖమే ఫలమ్మొ? ౭౭

ఏదియో జన్మమందు నే నెందుకొఁటకొ
చేసినవి నేఁటికిని నన్నుఁ జీల్చునేమి?
యే నొనర్చిన సత్కార్య మేమి యయ్యె?
దానికిని దుఃఖమే కదా! దాపురించె. ౭౮

ఇంత యన్యాయముండునే యీయనంత
కాలమను పుణ్యవాహినీ గర్భమందు?
'ఇదియిటుల నుండు' నని నిర్ణయింపఁగలమె?
విధిని యీమానవుండె కల్పించె నేమొ? ౭౯

స్వార్థపరులైన మానవుల్ స్వార్థమందుఁ
దమపనులఁ జక్కఁబెట్టుటే ధర్మమనుచుఁ
'గర్మ' మని 'పుణ్యపాపసంచితము' లనుచుఁ
గల్పనము చేయలేదె, యీకట్టుకథల? ౮౦

కల్పనముగాక సత్యమ్ము కలదె యిందు?
తమసుఖము లెంచియనిన ధర్మములు గావె?
కర్మ మేమున్నదోయి! మాకష్టములకు?
నీమనుజ సంఘమోయి! నన్నిటులొనర్చె. ౮౧

ఇట్టినరులందు నినుఁబోలునట్టివారి
సంఖ్యయే, నాయనా! యెంతస్వల్పమోయి!
సకలజను లెల్ల నీవంటిసరసులైనఁ
జెప్పుకోనేల, నింక మాస్థితుల నిట్లు? ౮౨

నల్లని వెల్లనీరమని నమ్ముచుఁ, దెల్లని వెల్లఁబాలుగా
నుల్లమునం దమాయకవు టూహలఁ దాల్చి చరింతువీవు, నీ
యుల్లమునందుఁ బొంగు కరుణోజ్జ్వలశోభయె లోక మేలినన్
జల్లని వీక్షణామృతవసంతము చిందక నిల్తురే కవుల్? ౮౩

నీవు తలంచునంతటి వినిర్మల మానసిక ప్రకాశ తే
జో విభవాంతరంగిత యశోమహితాత్ములఁ, టోయి?
లోకుల
య్యో! వినువారలుండని యయోమయ వాయువులందు
లీనమై
పోవునె! మావిషాదరవముల్ జనులింతటి దాతలైనచో. ౮౪

అందుల కేక దా! 'జనులనాదర మానసిక స్వభావులై
యుందురు! వారిశక్తులుపయోగముగావ' నుమాటరూఢి; వా

రందఱుం గూడియున్నను సహాయమొనర్చుటనున్న, కాని యే
కొందఱో మాత్రమే తగరొకో, కవికోటికి హాని
జేయఁగన్? ౮౫

అట్టియీమూర్ఖ లోకమే యంధకార
మున వసించుచుఁ బాతాళమునకు నన్నుఁ
దఱిమివైచెను; దానిపై, మఱువరాని
దైనపగ నాకు, జీవితాంతాన నైన. ౮౬

ఒక్కమానవులే యేలనోయి! వీనిఁ
బీల్చికొని పిప్పిచేసి కాల్పించుటకును?
తుదకు, నీజీవికకుఁ బ్రాణపదములైన
కావ్యములుకూడ నన్ను బ్రింగంగలేదె? ౮౭

అసలు నా కీర్తిగతి ప్రాప్త మగుటకొఱకు
కావ్యములె పుణ్యమును మూటఁగట్టుకొనియె;
అయ్యయో! యీవిషాద మే యారకున్న
మనసులోఁ దాండవించు నున్మాదవహ్ని" ౮౮

అని వాదించుచు కోప, మోహ, భయ, దుఃఖావేశ వారాశి
లో
మునుగం జాలక, దేలలేక, గతియేమో సైత మూహింపఁజా
లని యావ్యక్తి విచిత్ర వాక్యముల లీలల్ గాంచి, నిర్భ్రాంతి చే
మని పల్కఁగను నోరురాక "వినుమార్యా!" యంటి
నోదార్పఁగన్. ౮౯

ఏమిది? నాయనా! వినసహింపని నీపరుషోక్తిలో వ్యథా
హాలాహలపిపాస కింధనములో యన దోహద మయ్యె
నయ్యో! నీ

సేమముఁ గోరువారి నతిచిత్రముగా నిరసించునట్టి నీ
కేమతిదప్పెనో? నరులకే చెడనున్నదొ? చెప్పశక్యమే? ౯౦

దయ జనియించుచున్న దొకదానికి, నింకొకదానికిన్ సమ
న్వయ మడుగంటు నీపరుషవాక్యములన్ వినినంతనే; యయో
మయమగుచున్న దెల్ల; మతిమాంద్యముగూడను దప్పదాయె న
య్యయొ! యిఁక నీవిషాద మటులాపుము; నామతిమాట
యేమొకో? ౯౧

'లోక మొనర్చె' నంచు మదిలో ననుమానము వృద్ధిఁజేసి నీ
వే, కడ కుత్తపుణ్యమునకే, నిరసించెద వేలలోకులన్?
గాక, మనుష్యులేమి యుపకార మొనర్చిరొకో? యిదంతయున్
నీకు జగమ్ములో నిలువనీడ నొసంగిన దానికే కదా! ౯౨

అయ్యయో! నీకు నుపకార మాచరించి
నట్టిలోకమ్ము నీరీతిఁ దిట్టఁదగునె?
'దేనికైనను కర్మమే దిక్కు'టంచు
నరయక, తపింప, లాభ మేమైనఁ గలదె? ౯౩

నీవొనరించినట్టి యవినీతి కరంబగు చర్యచేతఁగా
దా! విడరాని బాధల విధాత లిఖించెను నీదయార్ద్రమా
జీవితఫాలమందు! నిఁకఁ జేసిన పుణ్యము మాటకేమి తే
దే? వచియింపుమ'న్న భవదీయ మహోజ్వల జన్మ
మేకదా! ౯౪

పుణ్య మొనరించినందుకే పొందఁగలిగి
నాఁడ విటువంటి యగ్రజన్మమును నేఁడు;
ఎన్నఁడో చేసినట్టి యాపున్నె మొకటి
యేకదా! నిన్నువీని వ్రాయింపనిచ్చె! ౯౫

నీదు పాపమ్ము లనుభవనీయమగుట
చేతనే కాదె! నీకు దుస్థితి ఘటిల్లెఁ,
బాపముల నీవు పూర్వ మేర్పఱుపకుండ
నున్నచో నిన్ను విడచివేయునె జగంబు? ౯౬

లోక ముపకార మొనరింప లేక యుండు
టకును నీకర్మమే మహాటంక మోయి!
నీవొనర్చిన దుష్కృత మ్మివ్విధాన
నడ్డుగా నిల్వ, జగతి యె ట్లాదరించు? ౯౭

కాన సుకృతంబు నీకు విజ్ఞాన మీయ
దుష్కృతము గాదె! జ్ఞానకాంతుల హరించు;
సుకృత దుష్కృత మిళితమే, చూడఁజూడఁ,
గర్మగా వాడఁబడుచుండుఁ గాదె ధరణి? ౯౮

అందుచే నీకు నింత ప్రత్యక్షముగను
గానఁబడుచున్న కర్మమే కట్టుకథయె?
"కర్మ"మని యేర్చువారలీ కష్టసుఖము
లనుభవింపకయే దీని నన్నవారె? ౯౯

నాఁటి, యీకర్మ సిద్ధాంత వాదులకును
నీకుఁగల జ్ఞానమైనను లేకపోయి
యుండెనే? దీనినే చెప్పియుండలేరె?
కల్పనమొ, కర్మమొక 'కట్టుకథ' యటంచు? ౧౦౦

కాన సహోదరా! సకల కావ్యఫలంబగు నీయపూర్వ వి
జ్ఞాన మెఱిఁగింగనైతేను విచారములో మునుఁగంగ నేల? నీ
దీనతఁ జూడఁగాఁ గడుపుతీపి దహింపకపోదు కాని, యె
క్లైన, విపత్తుల న్మఱచియైనను, జింత మఱల్ప లేవోకో? ౧౦౧

దాసికై నీచరిత్రబోధనముఁ జేసి
యున్నఁ దుఃఖోపశమనమై యుండునేమొ?
స్వామి! నాకన్న నాప్తు లెవ్వారు నీకుఁ
గలరు? దయచేసి, నీగాథఁ దెలుపవేమి?" ౧౦౨

అనిన, నాదీన ప్రార్థన మ్మాలకించి,
శిరము పంకించి, లోని మత్సరము విడచి,
మనసులో పొంగుచున్న వేదన సహించి
దీర్ఘశోకమే లోనఁ జిత్రించె నతఁడు. ౧౦౩

దీర్ఘ మగునట్టి జీవితార్తిని మునింగి,
యోర్మితో గాఢమైననిట్టూర్పు విడచి,
మానసములోన గాంభీర్య మూని, కడకు
స్థాణువై పోయి యతఁడు నిశ్చలత నందె. ౧౦౪

తనమనోభావముల నిందుమనమునందుఁ
జెదరనీయకఁ బిడికిలిఁ జేర్చి, యతఁడు,
కనులనఱమోడ్చి, యాక్లాంతకంఠరవము
గద్గదికవోవఁ బలుకగాఁ గలిగెఁ గడకు.         ౧౦౫

"ఎంత యమాయకుండవో కదే! సఖ! నేటికిఁగూడఁ బ్రాఁతసి
ద్ధాంతములందు మూఢపరతంత్రిత మానవె? పూర్వమందునా
దెంతటిసేవయో మఱచెనే జనలోకము? దానికిట్టి దుః
ఖాంతనివాసమేల ఫలమాయెనొ? తెల్పవిదేమి పాపమో! ౧౦౬

'నీకు మనుష్యులేమి యవినీతిఁ దలంచితిరన్న'? ప్రశ్న క
న్నా! కడకేమి వాక్యములనంగలవాఁడను? నావిపత్తునీ
వే, కడ కొక్కజామనుభవించినచోఁ దెలియంగఁజాలవే?
కాక మెఱుంగునే, వృషభకాయము పైఁగల గాయ
                                      వేదనన్?    ౧౦౭

నేనువచియించు వాక్కులేవైన, వెఱ్ఱి
ధోరణి విధముగానీకుఁ దోఁప వచ్చుఁ
గాని, యీ వ్యర్థజీవి వాక్యములనైన
జీవిత విధానమే లేకపోవలేదు. ౧౦౮

మతిచెడఁగ నేస్తు జనులు దుస్థితినిఁబడెడి
వేళలను జ్ఞానశూన్యులై వివిధములగు
స్వార్థమే లేనిపనులఁ జేయంగఁజూతు
రట్టినరులందు నొకఁడ నే నౌదు నోయి! ౧౦౯

స్త్రీల, మానుల, కవుల భావాలఁ దెలియ
యుగయుగములైన జాలక యుండుసుమ్మి;
మాను లొక్కొక్క వేళ నున్మాదు లగుచుఁ
గవుల లోకమార్గమును జూపఁగలిగినారు. ౧౧౦

అంతమే లేని జలధిజలాంతరముల
నలరు రతనాలఁదీయఁగానలవియగునె?
అటులె యున్మాదము వహించు యతుల, కవుల
భావముల నెంచఁగా సాధ్యపడునె. మనకు? ౧౧౧

కనుక, నిటు చేయుటకు ముఖ్యకారణమ్ము
లేకపో లేదు నా వెఱ్ఱిలీలలందు!
మతిచెడినవారు సేయుకర్మములనైన
కారణము శూన్యమగుటయే కలుగనేల? ౧౧౨

ఇంక నాగోల పరికింప నిచ్ఛయున్న
సావధానమ్ముతోడ నిశ్చలతమున్ని
వెనుకటి చరిత్ర మంతయు న్వినినఁగాని
గ్రాహ్యమవజాలదోయి! యాకలుషగాథ. ౧౧౩

శ్రావ్యమే లేని నాయీవిషాదగంధఁ
దడుమువలెనన్న నీబాధ తప్పఁబోదు;
ఐనఁ, బోనిమ్ము, నీవంటి యాప్తుఁడొకఁడు
వేఁడ, నినుఁజిన్నబుచ్చులే వెఱ్ఱియాహా! ౧౧౪

లలిత హృదయాన శ్రేయోభిలాషియొకఁడు
కౌతుకము పొంగ నాగాధకై తపింప
నీనిరుత్సాహమే వాని కీయ నేలఁ?
దెలిసికొనుఁగాక యాతఁడీ కలుషగాధ! ౧౧౫

జీవితక్షోభఁ దెల్పు నిశీథమందుఁ
జేర, నీకన్న నాప్తు లెవ్వారు నాకు?
బంధువర్గంబులో ముఖ్యబాంధవునకుఁ
దెలుప, దుఃఖోపశమనమే కలుగు నేమొ? ౧౧౬

ఇంతకన్నను నాకింక నెవరుగలరు?
కాన, నీతోడనే పలుకంగఁ దలఁచి
నాఁడ; నినుఁ గష్టపెట్టుచున్నాఁడ నేమొ?
ఐన నేమాయె? నీవునాకభయమీయు! ౧౧౭

నాభవిష్యత్తు మొదట నిర్ణయమొనర్చి
కొంటి, నదిమార్చుటకు నొప్పుకొననుగాదె?
కాన, దుఃఖోపశమనమే కారణమ్ము
గాఁదలంచి వచింతు నాగాథనేఁడు. ౧౧౮

గ్రీష్మ భాస్కర కిరణాగ్ని కీలలందు
వాడి వత్తలైనట్టి పుష్పములమాడ్కి
భగ్నహృదయానఁ గల్గు జ్వాలాగ్నిశిఖల
దహనమగు నన్నుఁగాంచి యోదార్చుమయ్య! ౧౧౯

ఈతమస్వినీరాజ్ఞి న న్నిటకు నేఁడు
పిలిచి, కడసారి, పల్కు నాజ్ఞల నొసంగెఁ!
గానఁ, గరుణించి, యీయంధకారమందు
సోదరా!

విను,

నా, యీ, విషాదగాథ! ౧౨౦



నేను జనించునాఁడు జననీజనకుల్ దమ కెట్టకేల కిం
పైనఫలంబు నాగతి దయామయుఁడిచ్చె నటన్న ప్రేమలో
లీనతఁజెంది భ్రాంతిని జలించిరి. నేను సుఖాలఁదేల, న
జ్ఞానమదమ్ము లోమఱునఁజాలిరి వారుదరిద్రవేదనన్. ౧౨౧

తనతల్లి పులకరింతల నెఱుంగక ఱొమ్ముఁ
జిన్ని చేతుల బాదు చిన్నతనము
తనతండ్రి ముద్దు పేర్లను బెట్టిపిలువంగఁ
జిలిపినవ్వులఁజేరు చిన్నతనము
తనయాట వస్తువులను బంధుగులు దాఁచఁ
జిన్నఁ బోవుచునేడ్చు చిన్నతనము
తననోటి చొంగవాగునరాలు మురిపెంపు
సన్నగొంతుకనెత్తు చిన్నతనము

అట్టియానాఁటి శైశవంబందు నిందు
ప్రేమనల్లారుముద్దుగా పెంపఁబడితి,
నాఁటి యాబాల్యచేష్ట లీనాఁటికైన
సమయముల జ్ఞాపకము రావె స్వప్నములుగ? ౧౨౨

సుఖముగా తల్లిపోషింపఁజూడలేని
కాలరాక్షసి యీర్ష్యఁ గరఁగి మఱిఁగ
నాకు రెండేడ్లునిండని నాఁడె నాదు
ప్రేమనిక్షేపమును పొట్టఁ బెట్టుకొనియె. ౧౨౩

ఎన్ని భాగ్యంబు లుండిన నేమి ఫలము?
ఎంత యశముండినపుడైన నేమి కలుగు?
ఎంతపరివార ముండిన నేమి యొలుకు,
భాగ్యమగు తల్లిలేని నిర్భాగ్యునకును? ౧౨౪

కన్న నాతల్లి మరణింపఁ గల్గుకొలఁత
మాపుటకు నెన్నికోట్ల జన్మములు పట్టు?
నట్టి మాయమ్మ మరణించి నపుడుఁగూడ
బ్రతుకఁ గల్గితిఁ గష్టముల్ పడుటకొఱకు. ౧౨౫

తనకుఁ గల్గిన యొక్కఁడే, తల్లి లేని
వాఁడగుటఁ గాంచి, నాతండ్రి వనటనంది
యెట్టిలోపంబు రాకుండ దిట్టపఱుప
దాదులను బెట్టి పోషింప దారిఁజూపె. ౧౨౬

మాత గతించునాఁటికి నమాయిక జీవుఁడనై నన్నుఁ బ్రే
మాతిశయాన నాతఁడు శ్రమంబున కోర్చుచుఁ బెంచుచుండెఁ
"యీ
రీతిగ నేఁడిటుల్ కనికరించు మనుష్యులె, మోసగింతురే

మో? తెలియంగలేము? మునుముం దెటు లుండు?" వటంచుఁ
బల్కెడున్. ౧౨౭

అతఁడే నాకు సమస్తమున్ దెలియఁజేయంజాలి, యెన్నెన్ని సం
గతులో నన్నెఱుగంగనిచ్చి, తనసంకల్పంబుసిద్ధింప దు
ర్గతిఁ బోఁదోలి సమస్తవిద్యలను సాకల్యంబుగాఁ జెప్పియు
న్నతికై యెంతయుఁ బ్రాఁకులాడి కడకైనన్ గూర్చె
నుద్యోగమున్. ౧౨౮

తన నిగర్వప్రవృత్తి చేతను గడించు
పలుకుబడి నెల్ల వినియోగపఱచి, తుదకుఁ
దనకుఁగల శక్తినంతను ధారవోసి
కట్టె నుద్యోగ మిటుల నాకంతమునకు. ౧౨౯

ఇంతటి బాధ కాతఁకు సహించి యొసంగిన దానియందునా
వంతయు నిష్టమైనఁ గఅవయ్యెను నా కిఁక, నేమియందు? నా
చింతలు సర్వదా జనులసేవకె బాల్యమునుండి లగ్నమై
గంతులువైచెఁ గాని, కలకాలము దీనిఁ దలంపనిచ్చె నే? ౧౩౦

సారమే లేని సంసారసాగరమున
నీదుకొనలేక లోనమునిగెడి సమస్తఁ
జీవుల విషాదజనిత దుస్థితిఁ దలంచి,
జాలి జనియింప, నౌదార్యఁ జాటినాఁడ. ౧౩౧

ధరణిలో, లోకసంగ్రహార్థము, సమస్త
ప్రాణికోటికి దేహ మర్పణము చేసి
విశ్వమానవ కళ్యాణవీథియందు
నడువవలె నన్న యా వేదనము జనించె. ౧౩౨

వెఱ్ఱియూఁ వేదనమ్మున జీవితవికాస
కళికనొక దానివాంఛించి కలచెమనసు.
భావశూన్యమౌ హృదయ స్రవంతినుండి
యూటలై, భావ జలధార లూరి పొంగె. ౧౩౩

అన్వయింపని దేదియో, యవ్యక్తమైన
మార్పు జనియింప, జీవితాత్మయో, తదీయ
హృదయమును విప్పి వీక్షించె నీయగాధ
రాజ్యకూపాలలోని, మర్మపరిసక్తి. ౧౩౪

అలఁతి హృదయమ్ము నాదు శూన్యతఁ దలంచి,
"యీయనంత జగంబె నా కేక శరణ్య"
మని తలంచి భ్రమించుచు నార్తిఁ జెందు
లేఁత హృదయాన, జాలిమల్లియలు పూచె. ౧౩౫

ఈవిశాలప్రపంచమం దేను తుదకు
నొకవిహంగమ మైతి; నిట్టూర్పుమేఘ
మాలికలు దారినాపెఁ; జెమర్చుతలఁపు
పొరలపై రాలెఁ గళలతుంపురుల సరులు. ౧౩౬

కనులముందేవియో గాని కానుపించె,
మానసిక పత్రములు వ్రాయ మనసుపుట్టె,
'పాడవలె' 'వ్రాయవలె' నను భావకాంక్ష
శ్రావ్యమై చిత్రకళలఁ బ్రోత్సాహపఱచె. ౧౩౭

మనసు చలియింప వెడలు పాంథునివిధాన
స్వప్నవీధుల విహరించు సమయమందు
నామహాసాధ్వి బొమ్మ యిల్లాలు నాకుఁ
గరుణాహృదయంబుఁ జూపి సాక్షాత్కరించె. ౧౩౮

దివ్యసౌందర్యరూప సందీప్తమూర్తి
జ్ఞానతేజోవిరాజ మానద్యుమమ్ము
సైననాజ్యోతి దేదీప్యమానమైన
జ్వాలల నటింప, జోహారు సల్పుకొంటి. ౧౩౯

హృదయకమలంబు వికసించె నీప్రశాంత
జీవితసరోవరమున తేజిలుఁగు లెగయ
'మానసిక చంచరీకంబు మధువుఁ గ్రోలి
పూలపరదాలలోన నుయ్యాల లూఁగె. ౧౪౦

దివ్వెలేనట్టి తిమిర యాంత్రికున కొక్క
దీపిక లభించునట్లు సందీప్తకిరణ
పంక్తులను బంపి యొకజ్ఞానపథముఁ జూపె
నానవోదయ జీవసంధానకళిక. ౧౪౧

రాలఁ గరఁ గించు దివ్యధా రాస్రవంతి
యై, పవిత్రప్రచోదనాహ్లాద మొసఁగి
మానసక్షోణి నమృతోపమాన సుధలఁ
గడిగె, నభిషేకమునకు గంగాభవాని. ౧౪౨

కరడుఁ గట్టిన నాలోని కల్మషమును
క్షాళిత మొనర్చె లోనివాక్స్రవంతి
దానిచేశుద్ధమైన నాత్మపరిశాంత
గోష్ఠిలో విశ్వరూపముం గొలువ సాఁగె. ౧౪౩

ఐహిక క్లేశ శోకమ్ములంతరింప
మనసు శాంతమ్ములోన తన్మయతఁ జెందె;
ఆత్మ యావిశ్వశక్తి కాహ్వాన మొసఁగి
విందుగావించుకొనె వినువీధియందు. ౧౪౪

ఇంతటి యున్నతోజ్వల మహీవలయంబున సంచరించి, యే
కాంతనివాసమందు కలకాలము నిద్దురఁజెందునాతఁడీ
క్లాంతకఠోరభారము సహింపఁగఁగల్గును? రాను, రాను, నా
వంతయు నిచ్ఛయైనకఱవయ్యెను సేవకవృత్తిలోపలన్. ౧౪౫

నానిరుత్సాహమును గాంచలేనితండ్రి
లేఁతహృదయాన నాబాధ లిఖిత మయ్యె;
నావిషాదము నుపశమనంబుచేయఁ
జాలుటకుఁ దండ్రి పెండ్లి నిశ్చయ మొనర్చె. ౧౪౬

ఇట్టివాంఛయే లేకపోయినను గాని
జనకుని యనుజ్ఞ దాటఁగా శక్తిలేక
వైభవోపేతముగను వివాహమతఁడు
చేయఁగా వ్యతిరేకమే చెప్పకుంటి. ౧౪౭

మునుపటి దినాల నేబాధ లనుభవించి
నాఁడనో? వాని నుద్వాహమాడి సైత
మనుభవించుట తప్పదయ్యెను; మఱింత
యధికమైపోయె నవి వివాహమ్మువలన. ౧౪౮

ఇంతలో వీని కనుపాన 'మది' యనంగ
వృద్ధుఁడైనట్టి తండ్రి జీవితననమ్ము
దగ్ధపఱుపంగ, మృత్యుభూతమ్ము వచ్చి,
కబళముగ మ్రింగె జనకు, నాకలి శమింప. ౧౪౯

అనుపమోదాత్త మూర్తియైనట్టి తండ్రి,
నాదు సుఖజీవితంబును నాటకమున
కాదినే సూత్రధారుఁడై యంతమందు
భరతవాక్యంబుతో తెర వాల్చె నిట్లు. ౧౫౦

అకట! నాజీవితంబగునట్టి తండ్రి
నన్ను విడిపోవ, పత్నినైనను భరింప
మార్గమే తోచదయ్యె; నామతికి సైత
మతసమ్మృతితోడ నిస్సహాయత జనించె. ౧౫౧

జనకుఁడు గతించినందుకే, సగముచచ్చి
యున్నదానికి దోహద మన్నరీతి
దేనిని తిరస్కరింప యత్నించియుంటి
నట్టియుద్యోగమును సైత మంతరించె. ౧౫౨

పలుకఁ నేరైన రారైరి; పలుకరింప
నెవరుఁ గాన్పింపరైరి; నే నీధర్మితి
నేది కానున్నదో దాని నెఱుఁగలేక
తల్లడమునందియుంటి నా తరుణమందు. ౧౫౩

తండ్రి మరణించునాఁడె వేతనముఁబోయె;
ధనము నార్జించు వేఱుసాధనము లేక
'కావ్యములఁ జిత్రముల వ్రాసి గడుపవలయు'
ననుట, వీడుద మనిన, తప్పినదికాదు. ౧౫౪

నామన స్తత్త్వముల సమానముగఁగల్గెఁ
గళలపై మక్కువను జూపు కౌతుకములు;
నే నిటుల నుండ, ధర్మపత్నిని వహించె
భోగలాలసమనెడి దుర్మోహగుణము! ౧౫౫

ఆజనకుండు నా వెనుక నండగనిల్చి భరించుదన్క, నా
కీ జగమందు జీవితము 'లింతె!' యటన్న నిరాశయేది? నేఁ
డీజడునిన్ భరించి క్షమియించెడివారలె కానరైరి! య
య్యో! జగమందు దాఁగుకొనియుండఁగ నీడయునైన
లేదిఁకన్. ౧౫౬

నేను జెమటూడ్చి తెచ్చుదానిని, గణింప
కయె మెలంగినదామె సౌఖ్యముల మున్ని;
ఆమెలోని స్వభావ మత్యంత విభ్ర
మమును గల్గించె, లోన దుఃఖము జనింప. ౧౫౭

తాను, తనసౌఖ్యమేతప్ప, తనకుఁగాను
నేను బహుబాధలను గమనింపనయ్యొ!
అతిభరంబైన నాదుబాధ్యతలఁదాను,
జూచి సుఖదుఃఖములను బంచుకొనదయ్యొ. ౧౫౮

ఆఁకలితుపాను జీవనౌకాశ్రయమును
విసరుచున్నను, ఆమె జీవితముకొఱకె
నేను సర్వస్వ మీయ యత్నించుచుండ
జాలి పడదేమి నాయవస్థలకు నామె? ౧౫౯

భారముతోఁ రచించునది భార్య కనుంగొని, గేలిసేయఁగాఁ
'గూరకువచ్చునా? తుదకు, కూడును గుడ్డయుఁ దెచ్చి
యిచ్చునా
సారములేని యీకవులజాడ్యము? వేఱు విధాలఁ గానలే
రా? రచన ప్రయాసయె దురాశ కదా'! యని చెప్పె
జాణయై. ౧౬౦

వంగి, చెవులందు నిల్లుగట్టఁగ, నామె
యెటుల దూషింప, నాలకించుటయె కాక
నామెతోఁ బోర లేక మాటాడ లేక
నేమి కర్తవ్యమో కూడ నెఱుఁగనైతి. ౧౬౧

మునుపఁటి తెఱంగున నె, గీతములరచించు
చుంటి, ఁజిత్రంబులను వ్రాయుచుంటి,ఁ గాని

యాకృతిని నిల్పు ప్రోత్సాహ మంతరింప
మోహునై యుంటి యుత్సాహమును గతింప. ౧౬౨

ఏదిచెప్పి న్వినకన న్నె పడించు
భార్యవచియించునది భిన్నపఱచెనన్ను
వినని యామూర్ఖతను గాంచి విసుగుఁ జెంది
యూరకోనలేక శోకాన నొదిగిపోతి. ౧౬౩

భర్తకును సౌఖ్యముల నిచ్చు భార్య యుండి
పత్ని బాధల గమనించు పతియె యున్న
నదియెఁ సంసారమగుఁ గాని, యటులఁ గాక
పతిపత్నులుఁ గయ్యమూనిన శాంతికలదె? ౧౬౪

ఎన్ని బాధలఁ బడియున్న నేమి, యామె
మందహాసంబు గాంచి తన్మయతఁ జెంది

మఱచిపోవుచునుంటి, కల్మషనివాస
మైనలోకమ్ములోని దుఃఖాతపమ్ము. ౧౬౫

అట్టిసౌకర్యమైన నాకబ్బకుండ,
జీర్ణ దేహాన నేను గృశించిపోవు
నటుల, ఁగర్కశమై, శుష్కమైన హృదిని
సల్పెఘోరమ్ము, కాలరాక్షసి, సఖుండ. ౧౬౬

నిస్సహాయుండనై నీలినీడ వెనుకఁ
గడుపు నొక కేల నిడుకొని గడుపునపుడు
గలిగె సంసారమందు, సాంగత్యసౌఖ్య
తతికిని సమాప్తిఁ దెల్పు శాశ్వతవిముక్తి. ౧౬౭

ఏలలితపద్మమండలంబేనుగాంచి
కలలలో నైన బ్రేమింపఁ గలిగినానో?

అట్టియర్ధాంగి, నాయ భాగ్యత ననంగఁ
బ్రసవవేదననంది యాపదలఁజిక్కె. ౧౬౮

ఎవరుఁగాన్పింపరైరి; నేనేమిచేయ
వలయునన్నను విజయమేఁకలుగదయ్యె;
వైద్యునిసహాయమే యసంభవమొనర్చు
చిల్లిగవ్వైన లేని దుస్థితిఘటిల్లె. ౧౬౯

మనుజు లుపకార మిడఁ జాలరనుట, సత్య
మైనఁ బోనిమ్ము; కాదని యనను గాని,
యొక్కమాటైన మమ్ము 'నెట్లుంటి?' రంచు
పలికి యోదార్చుటకుఁ గూడ పనికిరావె? ౧౭౦

దానికినిగూడ నోచుకోలేని నాఁడు
వైద్యుని సహాయమును గూర్చి పలుకనేల?

భారమా యీశ్వరునిపైన వైచియుంటిఁ
గాని, మాపైన నతనికే కరుణతప్పెఁ. ౧౭౧

ఏనవమోహనాంగి, యతిహీనతతో నను గేలి సేసినన్
గాని, పవిత్రభక్తిజనకంబగుభర్తృ సపర్యఁ జేసినా
లో నివసించుశక్తులకు లోపము రానియటుల్ చరించె నా
మానిని, నా సతీమణియమాంతముగా మరణించెరుగ్ణతన్. ౧౭౨

సూతికావాత మనువ్యాధి చుట్టుముట్ట
కబళమయె, మృత్యుశక్తి యాఁకలికి నామె;
ఆమెచితిపైన మండుదేహమ్ము వెంట
నంటియే దగ్ధమయ్యె నాయాత్మశక్తి. ౧౭౩

ఎవతె చిఱునవ్వు వెలుఁగు నాకీ జగాన
ఖేద తమమందు చంద్రునికిరణమయ్యె!

నట్టియర్ధాంగి మరణింప, నామె వెంట,
జననమందిన శిశువు కూడనుగతించె. ౧౭౪

దివ్యసౌందర్యమూర్తి గతించునప్పు
డుత్తరక్రియలను సల్ప విత్తమైనఁ
గానఁ బడదాయె; చిల్లిగవ్వైన లేక
ఋణము గావించితిని శోక మినుమడింప. ౧౭౫

మొదటనే లోనియభిమానమును నశింప,
మానుషస్వేచ్ఛఁ గోల్పోయి, మఱియ లేకఁ,
బ్రియసికి నంత్యక్రియలఁ గావింప నెంచి,
[illegible] ఋణ[illegible] జేసితి, సఖుండ! ౧౭౬

ఏవిపత్సాగరంబైన నీదుకొనుచు
బైటఁబడవచ్చుఁగాని, యీ ఋణిజు బాధఁ

దప్పికొనగల ధన్యులీధరణిఁగలరె?
అతనిచేఁ బడ్డ కష్టమింతంత కాదు. ౧౭౭

ఆమహాంబుధిలో దారి నరయలేక,
గడువునొకకేల నిడుకొని గడపువేళఁ,
దనకు నేమియు 'నీయులే' నని గ్రహించు
కొనెన, ఋణదాత, మాగృహమ్మునుహరించె. ౧౭౮

గూఁటికై వేడ నొకపూరి గుడిసెలేదు;
కడుపునకు పట్టె డన్నమే కలుగ లేదు;
గోలమఱపించుకూర్మి యిల్లాలు లేదు,
జనులలోనైన, జాలివీక్షణమె లేదు! ౧౭౯

ఆశాంతప్రతిమానమూర్తియె యాభాగ్యంబందు నల్లాడున
న్నిశోకంబున ముంచి గుప్తమయి తానెంతైన శోభిల్లె; నీ

క్లేశం బంతయు నన్నె చుట్టుకొనె, ముక్తిఁ గాంచలేనైతి! నా
యాశాసౌధము కూల్చివైచినది నాయర్ధాంగియంతంబిటుల్.

౧౮౦

ముందు వేసవియెండ నెండి, గాంచఁగ నేగి
నపుడైన, 'నింటలేమ' నెడువారు
కృపఁజూపి నన్నాలకించి, 'సరే, దాని
కేమిలే'? యని లోననేడ్చువారు
'ఇది చాలదోయి! నీవింకను నేర్చుకో
వలయు నే!' యని బోధపఱచువారు
'నిన్న మొన్నటిదాఁక నీ పేరువినలేదె?
అంతలో నెవఁడిచ్చె'? ననెడివారు
ఇవ్విధంబుగ జనులు నన్నీసడించి
పేదనగు నాదుపోరు తప్పించుకొనిరి;
కావ్యములఁ జిత్రములఁబట్టి కడుపుకొఱకు
పల్లె పల్లెలఁదిరుగంగ ఫలితమిద్ది. ౧౮౧

ఏమైన నచ్చువేయింప, నాగ్రంథముల్
గొనిపోవ, 'కృతులని' మ్మనడివారు
ముద్రిత గ్రంథమ్ము మూల్యమ్ముగని, 'మాకు
వెలలేమి?ట'ని మాతి విఱచువారు
'చదివియిచ్చెద'మని చల్లగాఁ గొని, వారి
పేరుతో ముద్రించివేయువారు
బూజుతో, చెదలతో మునిగి తేలెడి కావ్య
ముల'చెత్త' యని పాఱఁబోయువారు

వేనినీ హోమమునకు నర్పింప, నీళ్లు
నమలుకొంటినో? యట్టిచిత్రములఁగాంచిఁ
కినుకతోఁబల్కు'రీ పిచ్చి గీతలెవరి
నుద్ధరించు?' నటంచు పేరున్నవరులె! ౧౮-౨

తమ్మిపూవులె! నాదుపాదమ్ములివిగో!
తిరుగఁదిరుగంగ సీసపుదిమ్మ లయ్యె!
నొక్కరును గాంచియైన నిట్టూర్చనట్టి
నోరుకాలిన భగ్నమనోరథుండ! ౧౮౩

ఆశలడుగంట, సకలసౌఖ్యములుఁబోయె:
ఛిద్రమైనట్టి తేజ ముచ్ఛిష్టమాయె;
తిమిర పరివేష్టితుండనై, దిక్కులేక,
బ్రతుకు నీడ్చుచునున్న జీవన్మృతుండ! ౧౮౪

రమ్యమగు కాంతితోఁగళారాధనమున
నైక్యమైపోయి సంతసం బందునపుడె,
ఈ నిరుత్సాహ ప్రళయ ఝంఝానిలమ్ము
తగిలి కాబోలు కాంక్ష లస్తమయమయ్యె. ౧౮౫

క్షణముకాలమ్ములోనె, దీక్షయు నశించె;
తనివితీరని కోరికల్ తఱిగిపోయె;
ప్రళయకాల ప్రచండ సూర్యప్రదీప్తి
జనితతాపమ్ము నాలోన జననమందె. ౧౮౬

అలఁతిహృదయమ్ము కఠినకార్శ్యమయిపోయె;
హృదయ వనసీమలోని వాహిని నశించె;
లలితమై పొర్లునట్టి కళాస్రవంతి
యాగిపోయిన దిసుకకయ్యల నమర్చె. ౧౮౭

ఆశలను పూలు, జీవితోద్యానమందుఁ
దొలి వసంతోత్సవములతో వెలయుచుండ
భగ్నజీవికలోని దావాగ్ని పొంగి
చల్లె నాయస్థికల నీ శ్మశానమందు. ౧౮౮

సరళమై, సాంద్రమగు మానసస్థలమున
శరణుకై కట్టినట్టి యాశాగృహమ్ము
భగ్నయత్నంపు టగ్నిపర్వతము పగుల
శుష్కమై కూలిపోయెఁ గాంచుము సఖుండ! ౧౮౯

ఓర్చుకొనరాని వేడినిట్టూర్పు లెగయ
కర్కశంబయ్యె మానసిక ప్రవృత్తి;
ఇరుల పరదాలు శ్యామికాహృదయవాటి
నశ్రుతోరణములతో నలంకరించె. ౧౯౦

స్థాణువైపోయె జీవితాశాస్రవంతి;
సలిలము హరింప, నినుక తిన్నెలఁ జలించి,
మతులను భ్రమించు నాయెండమావులందు,
నిలిచి పరికించినను, నీటినీడ లేదు. ౧౯౧

ఆ కళావాంఛ నశియించె, నాపరిపూర్ణ
సంతత వికాస కాంతు లనంతమైన
దుఃఖసాగరగర్భమందున విషాద
నాదమున, మూల్గి యేడ్చుచున్నవి సఖుండ! ౧౯౨

నాగళమ్మున వాణి వీణను ధరించి
లలిత కంఠానఁబాడె మంగళరవమ్ము
తేలకో కాని యావి నశియించె చనియె!
వాణిశోకమ్ము వినిపించె, వీఁగ యాగ! ౧౯౩

ఎవ్వరో వచ్చి, కంఠమం దెఱుఁగకుండ
నావిపంచితంతిని ద్రెంపినారు నాఁడు;
తెగిన సుకుమారమైన తంతిని విదల్చి
శీతలశుభాంగి, వాణి మూర్ఛిల్లె నచట. ౧౯౪

తెగిన తంతుల నతుకఁబోవఁగ మఱింత
వ్యర్థమైపోయె నావీణ, వాంఛ లణఁగె,
వాణియైనను 'మేల్కాంచి పాడు' ననెడి
యాశ లేదింక, నా బాధ ననుభవింతు. ౧౯౫

నాదు సుకుమారమైన ప్రాణముల కిట్లు,
క్షోభఁ గల్పించి, క్షుద్రభిక్షునిఁగ నన్ను
మార్చివైచినదీ మాయామానవుండు
కాక, యెవరైన, నీధాత్రిఁ గలరటోయి? ౧౯౬

[illegible]ంతుచే, లోకులను గాంచఁగా, నదేమొ?
[illegible] దోఁచును కదోయి!
మానవుని మించువారలీ మహిని లేరు
గాని, మానవుఁడే తోఁడి వానిఁగూల్చు. ౧౯౭

అట్టిమానవుఁడే శల్యమైననాఁడు
ముప్పొఁగల్పించి నాశనమ్మును దలంచె
నట్టియీ మానవునకె జీవాత్మ నొసఁగి
విధినిఁదీర్చితి ననుకొంటి వెఱ్ఱినగుచు. ౧౯౮

భారతీ తన్వి నేర్పిన పాట మీఁటి
వినని యీమానవులను సేవింప నెంచి
రచనకును బూనితిని, సోదరా! యిదేమి?
గాథమైయున్న దేల, జగత్సృష్టి? ౧౯౯

విశ్వమానవ కళ్యాణ విభునినొసట
కుంకుమస్పర్శఁ దీర్చి యలంకరింప
తనరుధిరమెల్ల చేతఁజిందినను గాని
కావ్యలక్ష్మికి లేదు సత్కార ఫలము. ౨౦౦

ధనమా! పోయెను, కీర్తియా! చెడె, సమస్తశ్రీలు, సౌఖ్యంబులున్
జనె, నామూర్తిని లోనఁగొల్చిన మదీయప్రాణబంధమ్ము బా
సెను, బాల్యమ్మునఁ గన్నతల్లి మరణించెన్ తండ్రియున్నోచ్చె యో, 'నా
వ'ను వానిన్ విడనాడినందులకిదేనా, స్వర్గమీజీవికిన్? ౨౦౧

దేహముననుండు రక్తశక్తిని హరించి
దాహముగ లోక మీరక్తధారఁ బీల్చె;
తేజమే లేని యీ జీర్ణదేహమొక్క
సౌష్టవము లేని యస్థిపంజరము కాదె? ౨౦౨

కలలలో వ్రాసినట్టి వ్రాఁతలవిధాన
జనులకై నా సపర్య నిష్ఫలము కాదె?
మానవశ్రేయమునకు నాత్మను దహించి
చేయునది యెట్లు పరిణమించినదొ తుదకు? ౨౦౩

'దయ్యు, కరుణింపు' మనరు.....పోనిమ్ము, నాకు
గోల గమనించిరైనను జాలిఁగనరె?
జాలిఁ గనకున్న మానె, నా శక్తి నైన
చూడనేరరేమి? తుదకు... మెచ్చుకోన రేమి? ౨౦౪

చేయఁగల్గిన దేదియో చేయుచుంటి
నింక నోసరింపఁదగియున్న దేమి కలదు?
ఇంత చేయుచునున్నఁదానింతయైన
కరుణఁ గనదేల మూర్ఖలోకము? సఖుండ! ౨౦౫

ఇంతకన్నను నే నేమి యీయఁగలను?
దేని నోసరింప శక్యమో దానినెల్ల
వెనుకఁదీయక చేయుచున్నను, జగంబు
జ్ఞప్తికోఁ జూపఁదగు కృతజ్ఞత యుదేన? ౨౦౬

పనులకీ సేవ"నొకప్రతిఫలముఁగోరి
చేయుచుంటివె? యనుచు ప్రశ్నింపవలదు;
ఏలయన, నాదుపనులలో నెక్కడైన,
దేవుని పరమ్ము గాని దేనియును కలదె? ౨౦౪

అంతియే గాని, నా సేవయందు లోటు
కలుగనే లేదు......కాని......నొక్కటి వచింతు
తనకు, నాచేత గావించు పనులకైన
ననుభవించిన విశ్వాసమైన లేదు. ౨౦౫

జనుల కీసేవపై కృతజ్ఞతయునైన
లేకపోయిన నేమి పల్కిన ఫలమ్ము?
చేయఁదగుదాని నెల్లఁ జేసినను గూడ
ఫలము లేకుండునే, కర్మఫలముగాక? ౨౦౬

మఱతునే! యయ్యో! యెంతయమాయికుఁడను
"కర్మ" మని మొత్తుకొన్న నాగతి యికేమి?
కర్మమేమున్నదిందు లోకమ్మునందక్క
కర్మమేమనెనోయి? నాకష్టములకు. ౨౧౦

కర్మమని మొత్తుకొనుటలో, కష్టములను
మఱచిపోవుటతోఁ బాటు మనసునకును
ధైర్యమును జెప్పి యాత్మనోదార్చుటయును
దప్ప, వే ఱొక్కలైన సార్థకత గలదె? ౨౧౧

శాస్త్రసముదాయమని యెడి జారిలఁడు
కర్మమను నెడి వలఁబట్టి, కఠినమనము
గల్గి జగమును నండజోత్కరము నెల్ల
బంధన మొనర్చి, వేధించి బ్రతుకుచుండె. ౨౧౨

అంతియే కాని, కర్మకేమైన నరుల
జీవితంబులు దిద్దు వాక్సిద్ధికలదె?
శాస్త్రముల దిద్దఁగల్గు సత్సంఘమునున్నఁ
గాలమును, గర్మమును జేయుఘనత యేమి? ౨౧౩

కర్మసిద్ధాంత మెంత నిష్కల్మషంబొ,
పేర్చి నీకింత క్రితమె చూపింప లేదె?
'కర్మ' మని మొత్తుకొని తృప్తిఁగనుటలోన
జ్ఞానమే శూన్యమయ్యె; ప్రాజ్ఞత నశించె. ౨౧౪

అయ్యయో! "కర్మ" మని సత్యమరయఁబోక
లోకుల ప్రవృత్తిఁ గాంచఁగాలేక, దేహ
మర్పణము చేసినను లోక మున్నతమైన
చేరఁదీయంగ లేదు; మెచ్చినదికాదు. ౨౧౫

నాకు నుపకారమైన నొనర్ప జగతి
యెంచినదికాదు; తుదకు...తా నెఱుఁగనట్టు
లూరుకొననైన లేదు; న న్నుసురువెట్టి
నాశనము చేయఁదలఁచుకొన్నది, సఖుండ! ౨౧౬

నా విషాదాంత జీవితనాటకమ్ము
గాంచవచ్చిన మూర్ఖలోకమ్ము కడకు,
శోకభూమికఁ దాల్చి యీక్షుద్రజీవి
నటన సేయఁగ పకపక నవ్వనేల? ౨౧౭

నేను శోకింప నోదార్పనైన రాక
హాయిగాఁ దాను గీతంబు లాలపించు;
నేను మరణింపఁగా జాలినైనఁ గనక
హర్షముదయింప, వెన్క "హీఁ"యనుజగంబు. ౨౧౮

ఓ ప్రకటా! యిట్టి దొడ్డదైనఁ గలదటోయి?
నేను సేవింపఁగా, చేతనైనదానిఁ
జేయవచ్చును, కానిచో, చేతఁగాక
మానుకొనవచ్చుఁగాని యిమ్మాత్రదిక్కు తగునె? ౨౧౯

నానిరాశత్వ హృదయ సౌధానఁగల్గు
భగ్న యత్నమ్ములనెడి జ్వాలాగ్నికణము
లాగృహమ్మును దహియింప నార్పనొక్క
రైన, కన్నీటి కణ 'మింత' యేని లేదు! ౨౨౦

భగ్నయత్నమ్ములనెడిజ్వాలాగ్ని శిఖలు
హృదయసౌధమ్మునిటుల దహించుచుండ
నార్పుటకు రాలదేమి! యనంతజగతి
కనుల నొక్కటైన బాష్పముక్తాఫలమ్ము? ౨౨౧

గ్రీష్మభానుని కిరణాగ్నికీలలందు
వాడివత్తలైనట్టి పుష్పమాల మాడ్కి
నీక్షుధాగ్నిని కాలిపోయినను గాని,
యుర్విలో శూన్యమయ్యె నిట్టూర్పు నీకు! ౨౨౨

తనదు శ్రేయోభివృద్ధికై తమకపడుచు
నిత్యమును సేవఁ జేసిననే నశింప,
'నయ్యొ' యని యెత్తుటకు శిగ్గైన లేని
'యబల'! యీలోక మేమి చేయంగఁగలదు? ౨౨౩

ఇట్టి "యబల" కు దేనినో యిడుట యెల్ల
విశ్వమానవ సేవయా? వెట్టియా హా!
విశ్వమానవ సేవ గావించినంత
పుణ్యమనుమాట కేవలమ్మెను అహో హా! ౨౨౪

విశ్వమానవ సేవ జీవికి విముక్తి
నిచ్చునని ప్రాచ్యమున వృద్ధులెల్ల నసిరి;
కాని, తమసౌఖ్యమే గనలేని నరులు
విశ్వమానవ సేవ గావించు టెట్లు? ౨౨౫

అదియునుంగాక నీసేవ నాచరించి
పొందునది నాశనము దప్ప పుణ్యమొక్కొ!
ఐన. నీసేవఁగొను జను లర్హులైన,
సిద్ధి పుట్టించి, హానివచ్చినను సరెయె. ౨౨౬

పోని యీమానవులు పుణ్యమైన నెఱిఁగి
యుండినను, నిదియొకరీతి నూహునేమొ?
గాని, యటుఁగాక, దోషసంఘటనములకె
మూలమగు మానవులు దీని పొందుటెట్లు? ౨౨౭

ఒకరిచే సేవనందఁ దర్హులై, సమస్త
మనుజు లైనను? అందు, నాత్మకు ననంత
పారమార్థిక విజ్ఞానఫలమిచ్చు
నీకశాస్త్రజ్ఞ యట్టి యైహికుల కేటు? — ౨౨౮

జీవిత రహస్యతత్త్వ సంసిద్ధి నంది
ఐహికాముష్మిక సుఖంబు లందు నట్టి
పారమార్థికులకు నా సపర్య గాని
కాకులగు, లోకులా! దీని గాంచువారు? — ౨౨౯

నేను తమవృద్ధికొఱకె, ప్రాణికి సుఖమ్ము
లుండనీయక, వెఱ్ఱి బాలుండ నగుచు
రోదనము చేసి, సేవింప, నేదియైనఁ
జేయలేనట్టి జనులు వాంఛించు టెట్లు? — ౨౩౦

నేను తనపైననే వ్రాసినాను వీని;
తనదు శ్రేయస్సు కొఱకె బాధల భరించి
నాఁడ, సవియెన్ని చేసిన నన్నుఁబిల్చు
మానవుని కింత తేజ మెవ్వాఁడిక యిత్తు? ౨౩౧

ఇట్టి లోకులకై చేసినట్టి సేవ
నిష్ఫలంబయ్యె, తుదకు ప్రాణికి సుఖమ్ము
లేక పోయె సఖుండ! యీ లోకమనెడి
యబలకును నా సపర్యయే వ్యర్థమయ్యె. ౨౩౨

అబలపై నొకఁడ నపకార మాచరించి
యూరఁగఁ ద్రొక్కఁగ లోక మియ్యది కదోయి!
దీనికా నేను రచియించువాని నిడుట!
ఆ మహాశక్తిగాన నిది యుద్ధరాలె? ౨౩౩

నిర్మల వికాస భాసురోన్మీలనమయి
జ్ఞానకాంతులఁ జిమ్ము జిజ్ఞాస యిద్ది;
అట్టి యూశక్తి జనులకు నర్పణంబు
జేయ లేనింక! ఆత్మ మూర్ఛిల్లునోయి! ..౨౩౪

"ఆఁకలి" యటంచు పశువునై యార్చినపుడు
క్షుద్రభూతమ్ముగా నన్నుఁ జూసినట్టి
రాక్షసులు—మానవులు; వారిశక్తికొఱకు
పాటుపడ నేను నెట్లు నోరాడు నోయి? ౨౩౫

అట్టి లోకులకా స్వచ్ఛమౌ మదీయ
శక్తులను ధారవోయుట శాశ్వతముగ!
జనులు గావించునట్టి దౌర్జన్యములకు
వారిపైఁదీర్చుకొను ప్రతికార మిదియె! ౨౩౬

మునుపు మూఢుండనై పుణ్యమునకుఁగాను
చేసియుంటిని జనులకీ సేవ నిట్లు;
గాని; యది వ్యర్థమని నేఁటి కైనఁ దెలియఁ
గల్గితిని, గాన సేవింపఁ గలనె నరుల? —౨౩౭

అందుచే నాదు రచన లేవైనఁగూడ
జనులకీయను......తుదకొక్క సారియైన
జూసుకొననీయ...నిఁక 'నింత చేసినవుడుఁ
జేయనిది యేది?' యంచు వచింతు వేమొ? —౨౩౮

ఇన్ని వ్రాసియుఁగూడ నేనింతయైన
తృప్తిపరుపంగ జాలనైతిని జనులను;
చేయఁగలవానిలో నేమి, చేయలేని
వానిలో నేమి, నేఁ జేయలేని దిదియె! —౨౩౯

జనులకే తృప్తి నిడలేని సమయమందు
నీవు రచియించువాని వహ్నికి నొసంగి
యాహుతిని జేయ నేమియా? ననెద వేమొ?
శీఘ్రమే దానిఁగూడ వచింతునోయి! ౨౪౦

నేను వ్రాసిన కావ్యంబులే, నశించు
నన్ను వేధించిఁ బాధించి ఖిన్నపఱచె
నీకళారాధనంబె నన్ని దురంత
దుర్భరానంత దుఃఖ శక్తుల నొసంగె. ౨౪౧

ఈరచనఁగాంచ, జీర్ణమై, యేమ్పఁదెచ్చి
బాధ గల్పించు, నిది బడబానలమ్ము!
ఈదురంతపు వేదనం బింకిపోవఁ
జిత్రములఁగూర్చి ధూళిఁజేసితి సఖుండ! ౨౪౨

నారచన చేత బాధానివారణమ్ముఁ
జేసికొన వీని నే దహించితి సఖుండ!
నాకళనశించె.....తుదకేంక...నాకళా పి
పాసకీ జన్మమందు...నిదే...స...మా...ప్తి. ౨౮౩

ఏభూమిలో జనియించి వృద్ధిని గాంచి
మరణించిధూళిలో మణఁగవలెనో?
ఏమృత్తికాగర్భ మీమనోజ్ఞతఁజూప
కళలమక్కువ నందఁగలిగినానో!
ఏసృష్టిశక్తి నాకిట్టి ప్రకృతియొక్క
లావణ్యలహరి యుల్లరులఁజూపె
నేవిశ్వమాత నాకింతశాంతమునిచ్చి
యానందమున నోలలాడఁజేసె

నట్టి యీ మృత్తికకె యమూల్యంపుజ్ఞాన
మర్పణము చేయవలెనని యభిలషింతు
నీపవిత్రంపు మృత్తికకీ యభాగ్య
చిత్తమీయంగ నిశ్చయించితి సఖుండ! ౨౩౪

ఏ మహాదాత నుండి నే నీవివేక
మును గ్రహించుచు నీగీతముల రచించి
నాఁడనో? యట్టి మాతృ ఋణంబుఁ దీర్ప
నన్యమార్గంబు వెదక నెయ్యది లభించు? ౨౪౫

ఈ మహామృత్తికా సాధ్వి యీదరిద్రి
కష్టములఁ గాంచి జాలివీక్షణముఁ జూపి
తనదు వక్షాన దాచుకొందునని నల్కి
జ్ఞానినై, యాత్మకింపు నాస్థానమొసఁగె. ౨౪౬

లలిత కంఠాన జోలపాటల రచించి
యలసి సొలసిన నాకు నాహ్లాదమొదవఁ
'బాడెద' నటంచు శ్రావ్యంపుఁబలుకులాడి
తీసికొనివచ్చె నన్ను మృత్తిక సఖుండ! ౨౮౭

సంతత వికాస భరితహాస్తమున నన్నుఁ
బిల్చినది మృత్తికామాత ప్రేమఁజూపి;
యాపిలుపు వింటి, నిఁక శిరసావహించి
కలసి పోదును జ్ఞానభాస్కరు నొసంగి. ౨౮౮

ఇచట, నొకమూలఁబడి, యెవ్వరెఱుఁగనట్టి
స్థలమునందున్న మట్టిపాత్రమును గనుము;
ఆ మలిన పాత్రమే భూమియందు, నాదు
శక్తులను దాచ, ఁబిల్చు హస్తముగ దోఁచు. ౨౮౯

కృష్ణవేణమ్మ నోటివాకిట విలాస
వంతముగ లేచుసలిల మీవలకుఁ దెచ్చి
పాత్రముననున్న నీధూళిపైనఁ బోసి
వేయుచు సమాధి నిచటఁ గావింతు నిపుడు. ౨౫౦

ఐహిక క్లేశ శృంఖలమందుఁ దవిలి
నట్టి యీధూళి లోసి దివ్యపరిదీప్తి
నఖిల లోకమ్మునకు మూలమగుచునున్న
మట్టిలో కుండతోడ 'సమాధి'ఁ జేతు. ౨౫౧

అయ్యయో! యేమి యిదియంచు నార్తవేమొ?
పాత్రముననుంచి భూమిలో పాతఁబోవు
నట్టి యీధూళి 'సామాన్య' మనిభ్రమింపఁ
జెల్లునే? యిది జీవితాస్థికల ధూళి! ౨౫౨

గ్రీష్మభానునిభంగి దారిద్ర్యవహ్ని
యాత్మను దహించి బూదిసేయంగఁ దుదకు
ధూళియైపోయె నాత్మ; యీధూళివిడిచి
యీ ధరిత్రికి నింక నే మీయఁగలను? ౨౫౩

అట్టి యీధూళి "సామాన్యమ"ని తలంప
వీలులేదోయి! హృదయ మీవిధిని దాల్చె,
నిది పవిత్రితఁంది యాత్మీయ మయ్యెఁ,
దుదకు నైర్మల్యమున నిదే హృదయ మోయి! ౨౫౪

ఇంతకన్నను వేఱొక్కటేమి కలదు?
మృత్తిక ఋణంబుఁదీర్పఁగానిత్తు ననిన?
నిదియె నాయాత్మ! నా జ్యోతి! యింతకన్న
మేదినీమాతకింక నే నేదియిత్తు? ౨౫౫

ఇట్లునశియించి పరులెవ్వరెఱుఁగనట్టి
స్థితిని జీర్ణించి మృత్తికా స్థితిని గాంచు
శక్తులెన్నని కల విట్టి చందముగని ;
ఎంతశక్తి సమాధిష్ఠమై యంతమగునొ? ౨౫౬

మేటిప్రాగల్భ్య మిటు లస్తమించుచుండె
నని జగంబెల్ల నెట్లు గాంచెను సఖుండ?
జనులు గన లేని యాక్లిష్టసమయమందు
నెందఱు సమాధినొందిరో యెవని కెఱుక? ౨౫౭

తమకుఁ నుపకారమును జేయఁదలఁచువార
లిట్లు జీర్ణింప జనులు తా మెఱుఁగలేక
మూర్ఖతమమందు దృష్టిఁ గోల్పోవు చుండ
గాంచి యెటులుందు? మిది నివారించు టెట్లు? ౨౫౮

మానసిక దృశ్యమున ఛాయలోని వాయు
వులకు జీవమ్మునిచ్చి జీవులనొనర్చు
కవివరేణ్యుని లేఖినీ కదనమునకు
నెవరు గల్పించియుంటిరోయీ! లయమ్ము? ౨౬౫

బురదలోనుండు నొక మట్టిముద్దఁ దెచ్చి
యతిపరిశ్రమతో నిజప్రతిమఁ జేసి
ప్రాణములనీయు నీకళాబ్రహ్మశిల్ప
మనుభవించెడి హస్తమేమయ్యెనోయి? ౨౬౬

పైనఁ జెప్పిన నాల్గు జీవములె కాదు!
లలితకళలను వానికే లయముకాదు!
సకలసౌభాగ్యమగు చతుఃషష్ఠికళలె
కలసిపోనున్నవి కాలగర్భమందు! ౨౬౭

జనుల జీవిత గాథఁ గాంచిన, సఖుండ!
జనులు మూర్ఖులుఁ గానున్న సమయమందు
దేశమున శాశ్వతంపు కీర్తి నిఘటించు
లలిత కళ లెన్నియో ధూళిఁ గలియుచుండె! ౨౬౮

ఎందరి వికాస తేజమ్ము లెరుఁగలేక
మాయమై పోయె నీ యస్తమయమునందు!
ఎందరి మహాత్వ మీజీర్ణ మందిరమున
శిథిలమై పోవుచుండె శుష్కించిపోయి! ౨౬౯

శక్తికై యెందరీ కళాపీఠమందు
లగ్నమైయుండి తమ యమూల్యపరీక్ష
వ్యర్థమొనరించిరైన, సర్వస్వమెల్ల
త్యాగమొనరించిరో, జీవితము తెగించి! ౨౭౦

అట్టిత్యాగమ్ము నొనరించి నపుడుఁగూడ
ఫలిత మేమున్నదా మహాభాగులకును?
పరమశాంతకుఁగల్గు సంపదలుగాని,
శక్తిమంతుఁడు సావకాశములఁగనునె? ౨౭౧

దీనికంతకు మూలమేమైనఁజెప్ప
వలయునన్నచో జగతి తప్పదుకదోయి!
ఇంతబ్రహ్మాండమగు వికాసాంతమునకు
మానవులుఁదప్ప నెవ్వరీమహిఁగలరు? ౨౭౨

అకట! యీమానవులఁ గాంచియనుట యెద్ది?
వారిసాంగత్యమే యసంభవముఁగాదె?
కాన, నీవెన్నియనిననుగాని, నేను
జనులతాపత్రయమ్ము లెంచను సఖుండ! ౨౭౩

నీవు నాకెంత చేతుననినను౯గూడ
వీడలేనోయి మాకృష్ణవేణినింక!
ఇచట నాజ్యోతి యున్నదంచెఱుఁగుమోయి!
దీనికే యున్నదట్టి యదృష్టవశము! ౨౮౪

దీనికై యెంతయేడ్చిన .నైన,నరుల
యత్నములు శూన్యమైపోయి వ్యర్థమగును;
నరుల కమ్మగలేనోయి! నాదుశక్తు
లివియు...నిచ్చటనే...నశియింప...వలయు! ౨౮౫

పూర్వమీమానవుల చేతఁ బొందినట్టి
యనుభవవ్యాధులే మాననైన లేదు;
మనసుకొకసారి బుద్ధివచ్చినదిగాన,
మానవుల మైత్రియేవద్దు మచ్చికైన. ౨౮౬

పాడుజనులకు, నాకు సంబధమింక
తండ్రికాష్ఠమ్ముపైననే దగ్ధమాయె;
నాకుజనులకు నేమి బాంధవ్యమోయి?
వారి దా దారియైన, నాదారియిట్లు! ౨౭౭

భగ్నకార్యాలవలన సంభవముజెందు
వెఱ్ఱి యుక్రోషమునఁ జింత వెడలఁగ్రక్కి
యాపుకొనలేక నేనిటులంటిఁగాని,
మానవులఁ దిట్టినను లాభమైనలేదు. ౨౭౮

కళవళించెడు నాలోని కడుపుముగ్ధ
చేత నీరీతి జనుల దూషించినాను
గాని, యీ మానవుండెట్టి హానినైనఁ
జేసినను, వానినన్న వచ్చెడున దేమి? ౨౭౯

ఆత్మ, పరమాత్మయందు నైక్యంబొనర్చి;
మునుపనుభవించినట్టి వేదనఁదలంచు
కొనకయే, చేతునేనొక ఘోరతపము;
ఇంక లోకులతో స్నేహ మేలనోయి? ౨౮౦

అందుచే కాదె! ప్రథమమ్మునందె, నేను,
'దేవుని పరమ్ముగాని దేదియునుఁగూడ
నాసపర్యలలోనఁ గానముకదోయి'!
యని వచించితి, నిఁక దీనియర్థమేమి? ౨౮౧

కాన, నాసేవయెల్ల నిష్కామ్య కర్మ
దక్షమతియొక్కటని యింక దలఁచవలదు;
ఆస లుడిఁగిన సత్కళోపాసి కిట్టి
కళలె పరమాత్మయొక్క ఛాయలు గదోయి! ౨౮౨

కాని, మొదటనే, యాత్మ, సంగతి గ్రహించి
యైహికగ్లానిలో లీనమగుట మాని
మౌనివలె యోగదీక్షాసమాధినుండి
యున్న, నీరీతిగా నుండియుండు నొక్కొ? ౨౮౩

ఇప్పుడైనను మించిపోయినది లేదు;
మఱల నీవైతరణిలోనఁ జొరనుగాన
నన్ను పరమాత్మయందె లీనమునుఁ జేసి
కొనెద, నాతఁడు, జనులకన్నను ఘనంబు. ౨౮౪

జన్మ మెత్తినదాది యీక్షణము వఱకు
ఐహికక్లేశ సంపర్కనుందె దవిలి
యుంటి, నీయాత్మకిఁక శాంతి యున్నగాని
జన్మమెత్తినందుకు నేమి సార్థకమ్ము? ౨౮౫

శాంతికై దాహమాత్మ కింతింతగాదు!
శాంతము లభించు వఱకు నిశ్చలత లేదు!
దానికైయాత్మ యెంతయో తమకపడును;
అదియె లేకున్న నీకు జీవితాంతమోయి! ౨౮౬

ప్రాణికోటికి నెల్ల, ప్రపంచమందు;
పుట్టి చచ్చుటతో తీఱిపోవ లేదు;
జన్మరాహిత్య మొనఁగూర్చు శాంతికొఱకు
జీవితంబీయకున్నచో సిద్ధియేమి? ౨౮౭

శుద్ధమై, నిర్వికల్ప సంసిద్ధమైన
శాశ్వతానంద పదవికి శాంతిదప్ప
వేఱుసాధన గలదె జీవితమునందు?
దానితో జేయరే ఘోరతపము మునులు? ౨౮౮

అస్థిరంబైన దేహమ్ము నాదరించి
యాత్మ ఉబలాటమేలనే నాపవలయు?
నాత్మ సంస్కారమే యవశ్యముగ నింకఁ
గోరి నేఁదాల్తునోయి నిర్గుణసమాధి. ౨౯

జీవితమునందు తత్త్వసంసిద్ధికొఱకు
నాచరింతును గర్మసన్న్యాస దీక్ష:
సర్వసంగపరిత్యాగ సాధనంబై
శాంతితో నిచ్చు యోగదీక్షాసమాధి. ౩౦

ఇట్టి విధులెల్ల శాంతినాకిచ్చు ననెడి
నమ్మకంబున్నదీ విధానముల యందు!
క్షోభఁ గల్పించుకొనిన యాత్ముఁడ జీవ
మునకు నీదీక్ష శాంతి నిచ్చును గదోయి! ౩౧

కాన, నీకృష్ణవేణి యొక్కటియె నాదు
వేదనోపశమనము గావింపగలదు!
అలల జిలిబిలి రవళి ముద్దులుఘటింప
కృష్ణవేణమ్మ చలవ ముక్తినిఘటించు. ౨౯-౨

కృష్ణవేణమ్మ తల్లివాకిట వసించి
నానివాసమ్ముఁ జూచుకొన్నాఁడ నేఁడు;
నేనొక విషాద గీతిక నే కదోయి!
ఈవిషాదమ్ములో నుదయించు శాంతి! ౨౯-3

"ఎందో నేజనియించి, యీజగతిలో నీరీతి సౌఖ్యంబులన్
బొందన్ జాలక, బాధలంది తుదకీ భోగంబులా- 'మిధ్య! యా
నందో బ్రహ్మ'మటన్నదే నిజముగానన్ తృప్తినిన్గంటి, నీ
సందేశంబును వ్యాప్తిఁ జేయుమవయస్యా! నీకుదీర్ఘాయువుల్".
౨౯ ౪

అన్ని వచించి యతండు తృప్తినివహించి
హస్తమునుజాచి కుండనున్నట్టిధూళిఁ
దీక్ష్ణమగు ఫాలమున విభూతిగ ధరించి
కొంతభస్మమ్ము దీసినాకును నొసంగె. ౨౯౫

అతని పనిఁగాంచి విస్మయమ్మావరింప
పలుకఁ నేలేక నేనందు నిలఁచియుండి,
వానియాజ్ఞల ధిక్కరింపంగలేక
నాచరించితి నిఁక శిరసా వహించి. ౨౯౬

ఆవిభూతిని నే ఫాలమందుఁ దాల్చి
నంతలో వాహినీ నీరమతఁడు తెచ్చి,
కడవలో ధూళితోఁ బాటుఁ గలిపి, దాని
మట్టిలో భక్తితోడ సమాధిఁ జేసె. ౨౯

మానియగు నాతనికి నేన[illegible]రింప,
దీక్షతో నాతఁడాశీర్వదించి, [illegible]
దీసికొని మాయమయ్యె, నదీ[illegible]
తనకుమారుని కౌఁగలింతల గదింప. ౨౯౮

"అయ్యయో! నిన్నుఁగని జాలినందువార
లొక్కరును లేరె యింతటియుర్విలోన!
అంతమాత్రమ్ముచేత నేమగును గాని,
పోనిలే, మంచిదే, తీఱిపోయె ఋణము! ౨౯౯

ఇంతమాత్రమ్మునకు భీతియేలనీకు?
ఎవ్వరున్నను లేకపోయినను గాని,
నాయనా! నీకు నేనులేనా"? యటంచు
నిమిరి, లాలించె కృష్ణవేణీస్రవంతి. 300